



బైసికిళ్ల సామానుల ఉత్పత్తి కేంద్రంలో (బొంబాయి) శ్రామికుడు చక్రపు అంచును మెరుగుపెడ్తున్న దృశ్యము. బైసికిళ్ల సామానుల ఉత్పత్తి శరవేగంగా పెరుగుతున్నది.






ఎవరెస్టు శిఖరారోహణ జయప్రదమయిన సందర్భమున జ్ఞాపక చిహ్నంగా భారత పోస్టల్, టెలిగ్రాఫ్ శాఖవారు 1953లో విడుదలచేసిన తపాలాబిళ్ల. ఇది యీ మధ్యనే నేషనల్ ఇటాలియన్ ఒలెంపిక్ సంఘమువారి 'ఎమిలియోకొమిలి' - రజితపాత్రను బహుమతిగా పొందినది. అంతర్జాతీయ బహుమతి పొందినదిదియే ప్రథమ భారత తపాలబిళ్ల. దీనిని నాసిక్ లోని ఇండియన్ సెక్యూరిటీ ప్రెస్ వారు తయారుచేశారు.

# అపారమైన శక్తియుత్సాహముల మీ ప్రతిష్ఠను కాపాడగలవు

KOTHANDARAM

# అమృత

## మధురమైన పానీయము




వ్యాయామ క్రీడల్లో పాల్గొనేవారందరికీ అవసరమైన ఉత్సాహ శక్తుల్నియిచ్చే ముఖ్యసాధనం అమృత - ఆ బాలగోపాలానికి అద్భుతమైన టానిక్. సేవించడానికి తియ్యగావుండి దూరించి చురుకుదనాన్ని కల్గిస్తుంది. ఈ అద్భుతమైన పానీయం ప్రసిద్ధమైన మూలికలచేతనూ ఫల రసాలతోనూ తయారుచేయబడింది. అందరికీ ఆత్మబంధువు లాంటిది.

## కేసరి కుటీరము లిమిటెడ్ మద్రాసు

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాసపత్రిక

వ్యవస్థాపకులు

## డాక్టరు కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౨౮]     అక్టోబరు 1955     [సంచిక ౧౦

# విషయసూచిక





భారతదేశంలో భూదానయజ్ఞ వ్యాప్తితో ఆర్థిక, సాంఘికరంగాలలో విప్ల వాత్మకమైన మార్పుకొరకు నిర్విరామకృషి సలుపుతున్న ఆచార్య వినోబా భావే



డా॥ డి. కే. కార్వే సుప్రసిద్ధ సంఘ సేవకుడు. స్త్రీవిద్యపట్ల అత్యంత ఆ సక్తి చూపినవాడు. ఈయనకు భారత ప్రభుత్వము ఉత్తమోత్తమ గౌరవ చిహ్నాలలో ద్వితీయశ్రేణికి చెందిన 'పద్మవిభూషణ' బిరుదు ప్రదానంచేసి సత్కరించింది.




జయజయ గృహలక్ష్మీ సఖీ ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతిమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



# ఆచార్య వినోబా భావే

పూజ్య బాపూజీ అడుగు జాడలలో నిర్మాణ కార్యక్రమంలో అచంచల విశ్వాసం కలవాడు ఆచార్య వినోబాభావే. గాంధీజీ సిద్ధాంతాలు, ప్రణాళికలు భారతజాతీయ సౌభాగ్యమును తీర్చి దిద్దిగలవనే గట్టినమ్మకముతో నిస్వార్థంగా కృషిసల్పుతున్న త్యాగధనులలో ఆచార్య భావే ఒకరు.

అందులోను సంఘజీవితంలో కలిమి లేముల నడుమగల అఘాతమయిన తారతమ్యాన్ని శాంతియుతంగా, మానసిక పరివర్తనద్వారా సాధ్యమైనంత త్వరలో తరుగజేసి జాతీయ సంపదను, ఆదాయాన్ని సమాన ప్రాతిపదికగావించుకొని యావత్ప్రజానీకం సుఖసౌభాగ్యాలకు చేరువకావాలనే యుద్దేశంతో ఆచార్యభావే భూదాన యజ్ఞము మీద తన దృష్టిని కేంద్రీకరించారు – కేంద్రీకరించడమేకాదు భూదాన యజ్ఞ సందేశాన్ని యావద్భారత దేశానికి పూరించారు. ఆ సందేశం భారతీయులలోనేకాక విదేశీయులలో సయితం విప్లవాత్మకమైన మానసిక పరివర్తనకు కారణమయింది.

కొందరు భూస్వాములు, రాజులు, రారాజులు వేలు, వందలు యకరాల భూవసతి కలిగియుండి, దానిలో చాల భాగం సాగుచేయబడక, మరికొంత సాగుచేయబడుతూ దానిని సాగుచేయుచున్నవారికి బహుస్వల్ప ఫలసాయముతో యుండి రైతు ప్రజానీకం ఆర్థికదుస్థితిలో గిజగిజలాడుతుండగా అనేకులు కృషిచేద్దామన్నా భూవసతిలేక నానాపాట్లు పడుతున్న మనదేశంలో తమ అవసరాలకు మీరియున్న భూవసతిని లేనివారికి తమంతట తామే దానంచేయడాన్ని ఆచార్య భావే భూదానయజ్ఞ ఉద్యమం ప్రోత్సహిస్తున్నదంటే హింస, అరాజకము, బల ప్రయోగంతో సాధించిన విప్లవాత్మకమైన మార్పులకంటె భూదాన యజ్ఞం మహోత్తమమయినదనేది సత్యసమ్మతము.

భూదాన యజ్ఞంలాగనే సంపద్దాన యజ్ఞము సయితం ప్రోత్సహించతగింది. అయితే భూదాన యజ్ఞంకాని, సంపద్దాన యజ్ఞంకాని ప్రజల్లో సోమరితనాన్ని, బాధ్యతారహితమయిన జీవితాన్ని ప్రోత్సహించడానికేర్పడినవి కావు. ప్రతి భారతీయ కుటుంబము దైనికావసరాలకు యిబ్బంది పడకుండా తమ సౌభాగ్యమును తీర్చిదిద్దుకుంటూ, దాంతో బాటు జాతీయ శ్రేయో పురోభివృద్ధుల పెంపొందించడమే ఆచార్య వినోబాభావే యొక్క ఉద్యమ లక్ష్యం. ఆ లక్ష్య సాధనకే ఆయన నిర్విరామంగా రాష్ట్రం, రాష్ట్రం, ఊరూరు తిరిగి తన దివ్య సందేశాన్ని పూరించి భూమిని సేకరించడం, లేనివారికి పంచిపెట్టడం.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల అండదండలున్నా భూదానయజ్ఞ ఉద్యమం దిగ్విజయంకావాలంటే పెద్దపెద్ద భూస్వాములు, సంపన్నులు అదనపు భూవసతిని, సంపదను లేమితో గిజగిజలాడుతున్న వారికి దానచేయడం యొక్క విశిష్టతను గుర్తించాలి. సానుభూతి, సద్భావ, సహకారాలతో భూ, సంపద్దానయజ్ఞాలు విజయపరంపరలుగా విస్తరించాలి. ఇదే ప్రపంచ వ్యాప్తమయిననాడు ఆచార్య వినోబా భావే, ఆయన ఉద్యమము ప్రపంచమొత్తంలో శాంతి సౌభాగ్యాలతో కూడిన శ్రేయోరాజ్య స్థాపనకు పునాది కాగలదు.

ఆంధ్ర దేశంలో భూదాన యజ్ఞ సందేశంతో పర్యటన ప్రారంభించిన ఆచార్య భావే విజయధ్వానాలమధ్య తన ఆశయ లక్ష్యాలు సిద్ధించేలాగ ఆంధ్ర ప్రజానీకం సహకరించగలదని ఆశిద్దాం!

# ఈ సంచిక

ఈ నెల ఆంధ్రరాష్ట్రావతరణ ద్వితీయ వార్షికోత్సవంతో ప్రారంభమయి, గాంధీజయంతి, దసరా ఉత్సవ వేడుకలతో ఆ బాల గోపాలము కోలాహలముగా నున్న సమయం.

ఆంధ్రరాష్ట్రావతరణ వార్షికోత్సవ సందర్భమున రాష్ట్ర సత్వర నిర్మాణమునకు ఆత్మార్పణముచేసిన శ్రీ పొట్టి శ్రీరాములుగారికి యావదాంధ్ర ప్రజానీకం భక్త్యంజలిని ఘటించింది. ఆయన త్యాగంయొక్క పరమోత్కృష్టతను స్మరిస్తూ తమ కృతజ్ఞతను వెల్లడించింది. అది మాత్రం చాలదు! — తన సోదర ప్రజానీకపు అభివృద్ధి అభ్యుదయాల నుద్దేశించి శ్రీ శ్రీరాములుగారు ప్రాణాలను సయితం త్యాగముచేసి స్వార్థరహితుడైన త్యాగి అనిపించుకున్నాడు. రాష్ట్ర నిర్మాణము మూలంగా తెలుగు ప్రజానీకం స్వీయ హక్కులను, అవకాశాలను, బాధ్యతలను సమరస సమైక్యతలతో అనుభవిస్తూ రాష్ట్ర పురోభివృద్ధితోబాటు జాతీయ పురోభివృద్ధికి సయితం తోడ్పడగలరని ఆయన ఉద్దేశం. ఆయన ఆదర్శ లక్ష్యాలు, ఉద్దేశాలు ఫలించడానికి అనువైన వాతావరణము త్వరలో సమకూరగలదని ఆశించడం సముచితమే కాగలదు.

గాంధీజీ దేవాంశ సంభూతుడు, అవతారమూర్తి అని కొందరంటారు; మరి కొందరు కాదంటారు. అయినా కాకపోయినా గాంధీజీ పూజ్యుడు. ఆయన దివ్య తేజస్సు, బోధనలు, నాయకత్వము యావత్ప్రపంచాన్ని ఆకర్షించినవి. క్రీస్తు, గౌతమ బుద్ధుడు, మహమ్మదులలాగనే పతనావస్థలోనున్న అస్వతంత్ర ప్రజానీకంలో స్వాతంత్ర్యకాంక్షను ఆత్మబలాన్ని పూజ్య బాపూజీ పూరించకలిగాడు. గీతాబోధతో అర్జునుని శ్రీకృష్ణుడు ఉత్సాహపరచి కార్యరంగమునకు దింపినట్లు గాంధీజీ నాయకత్వము నిస్పృహ నిరాశలకు గురియైన భారత ప్రజానీకమును స్వాతంత్ర్య సమరంలో ముందుకు నడిపించింది.

గాంధీజీ సత్యాహింసలు మానవకోటిలోని అమానుషత్వాన్ని, నిరంకుశత్వాన్ని అరికట్టి సద్భావ సానుభూతులను ప్రోత్సహించినవి. అంతేకాక త్యాగసేవాసక్తికి మార్గదర్శకములయినవి. పూజ్య బాపూజీ పరలోకవాసియైనా ఆయన బోధనలు, ప్రణాళికలు యీ నాటికి ఆనాటికికూడ భారత జాతీయ సౌభాగ్యానికి పునాదులవంటివను విషయము మరుపుకు రానట్టివి. వానిని అనుసరించి, అమలునందుంచి బాగు

పడవలసిన బాధ్యత ప్రజలది. ఆయన పటములను, విగ్రహములను పూజచేసి ఉత్సవాలు జరుపుటతోబాటు గాంధీజీ బోధనలను, ప్రణాళికలను అమలుపరచి అనుసరిస్తే బాపూజీ ఆత్మసంతుష్టి చెందుతుంది.


భారత జాతిపిత, లోకారాధ్యుడు పూజ్య బాపూజీ

దసరా నవరాత్రి ఉత్సవాలు, వేడుకల సందర్భమున దేవీ అనుగ్రహాన్ని ఉద్దేశించి చేసే ఆరాధనలు, దానధర్మాలు, అతిధిసత్కారాలు యావత్ప్రజానీకానికి సకల శుభంబులు సమకూర్చుగాక!

ఈ సందర్భమున మీ కరకమలముల నలంకరిస్తున్న 'గృహలక్ష్మి' దేవీ అనుగ్రహంవల్ల, మీ యొక్క ఆదరాభిమానములతో పూజ్య బాపూజీ, పొట్టి శ్రీరాములు లాంటి అమరజీవుల ఆదర్శ లక్ష్యాల వ్యాప్తికొరకు, తద్వారా రాష్ట్ర, జాతీయ పురోభివృద్ధుల నుద్దేశించి కలకాలము కృషిసల్పడానికి అవకాశములు ఏర్పడగలవని మా విశ్వాసము. పత్రిక అభివృద్ధి నుద్దేశించిన మీ సహకార సలహాలకు మేము సదా కృతజ్ఞులము.

—o—

# ఈశావాస్యోపనిషదు

పూజ్యపాద శ్రీ స్వామీ చిన్మయానందజీ.

## ఉపనిషదులు

ఓం. పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే ॥
ఓం. శాన్తిః శాన్తిః శాన్తిః ॥

అది పూర్ణము - ఇది పూర్ణము - పూర్ణమునుండి పూర్ణము వ్యక్తమగుచున్నది. పూర్ణమునుండి అపూర్ణమును తొలగించగా మరల మిగులునదికూడ పూర్ణము. ఈ శాంతి పాఠము ఒక మధురమైన, పరస్పర విరోధ భావములను తెలుపునట్లు అగుపడుచున్నది. బాహ్య పఠనంవల్ల అందుగల వాక్యార్థము మాత్రము గోచరమగును. అందుగల పదముల నిఘంటు అర్థములను వెదకి, విపులముగా ప్రయత్నించగల నవీన విద్యార్థి, భ్రమచెంది దిక్కుతోచకపోగలడు. ఇది యొక వేదాంత సిద్ధాంత సత్యవాక్యము. కనుక వేదాంత సిద్ధాంతములు శాశ్వత సత్యస్వరూపుని విషయములు తెలుపు అభిప్రాయములు. ఆ కాలాతీత అనంత స్వరూపునికిని, పరిమితిగల వస్తువుకునుగల సంబంధమును తెలుసుకొనకపోయినయెడల, ఈ మంత్రము అవశ్యము పాఠకుని భ్రమకు లోనుచేయగలుగుచున్నది.

వేదాంతుల నిర్ణీతమున, ఆత్మయే సత్యస్వరూపము. అద్వితీయుడు, సర్వాంతర్యామి, శాశ్వతుడు. ఇట్టి ఆద్యంతరహిత సత్యస్వరూపుని గురించి ఈ ఉపనిషదు విమర్శించనున్నది. విమర్శవలన తెలుప ప్రయత్నించుచున్నది. పూర్వపు మహాఋషులు, ఈ పూర్ణసత్యమును అనుభవించియున్నారు. "అదియే మనలోనుండు జీవకళ. ఈ బాహ్య పరిమితిగల ద్వంద్వ ప్రపంచమంతయు సత్యముపైన అధిష్టింపబడియున్నది. వాటికి స్వతస్సిద్ధమైన సత్యత్వములేదు" అని వక్కాణించియున్నారు. అనగా, ఆ ఆద్యంత, రహితుని దృక్కోణమునుండి దృష్టించిన, ఈ ద్వంద్వ ప్రపంచమంతయు అసత్యము. ఈ బహుత్వ దృశ్యమంతయు, స్థాణువునందు భూతమును చూచినట్లు అసత్యము.

అంధకారమున ఒక అలసిన బాటసారి, దారి ప్రక్కనున్న కూచమును చూచి అది ఒక భూతమని భ్రమించెను. భూతమునందు కొన్ని అవయవములుండుటవల్ల ద్వైతభావము ఏర్పడుచున్నది. దానికి తల ఒకటి, మొండెము ఒకటి, కాళ్లు చేతులు ఒకదానికొకటి సంబంధపడి ప్రత్యేక రూపములతో అగుపడుచున్నది. కాని, బాటసారి కూచమును గుర్తించిన యెడల, ఈ భూత దృశ్యము, దానియొక్క వివిధ అంగములతోకూడా, ఒక జ్ఞాన క్షణికమున, మాయమగుచున్నది. అటు పిమ్మట కూచము విశదముగా దృగ్గోచరమై, బాటసారి మనసు స్వస్థత పొందుచున్నది.

కూచము సదా పరిపూర్ణముగా నుండెను. భ్రమకు పాత్రుడైన బాటసారికి, భయంకర స్వరూపముతో రౌద్రాకార భూతము అగుపడినప్పుడు భూతము పరిపూర్ణముగనుండెను. అనగా, భూతము కనబడు స్థలమున కూచముయొక్క శేషమేమియు నిలచియుండలేదు. సమీప దర్శనమువల్ల, దీప ప్రకాశమున విమర్శింపగా, కూచమును బాటసారి కనుగొనినప్పుడు, భూతము అదృశ్యమాయెను. కూచము పరిపూర్ణమని అతని అనుభవమునకువచ్చెను. కూచములేనిచోట భూతముయుండలేదు. కూచమున్న స్థలముననే భూతముయుండెను. అనగా, భూతము కూచమున ఉద్భవించెను. కూచమున అస్థిత్వముగాంచెను. దాని

యొక్క నిత్యత్వము తాను అరువుగాంచెను. కడపట, కూచమునందే భూతములయము పొందెను.

ఇటులనే, ఈ మంత్రమున, పరమాత్మయొక్కడే నిత్యస్వరూపి. అతనియందు ఈ మనోబుద్ధులకు లోనైన (దృక్కు) మానవుడు, ఆ సత్య స్వరూపుని జ్ఞానము లేనందున, ఆ నిత్య స్వరూపమును చూడలేకున్నాడు. దానికి బదులు, ఈ వికార ద్వంద్వ ప్రపంచమును, దాని వ్యవహారములను చూచుచున్నాడు. సత్య స్వరూపము లేని స్థళమున ప్రపంచ స్వరూపము కనబడుటలేదు. ఈ మానవుడు చూచి అనుభవించు ద్వంద్వ ప్రపంచ దృశ్యమంతయు, సత్య స్వరూపముననే అస్తిత్వముగాంచియున్నది. ఈ చూచు మానవుడు తన మనోబుద్ధుల సామగ్రిలను అతిక్రమించి, సత్య స్వరూపమును పరిశుద్ధముగా పునర్దర్శనము గాంచినయెడల, మనోబుద్ధులవలన అందు అధిష్ఠింపబడిన ద్వంద్వ ప్రపంచ అధ్యాసము తొలగిపోవును. అతడు పావన సత్య స్వరూపమును పరిపూర్ణ వైభవముతో దర్శింపగలుగుచున్నాడు.

ఇట్టి గొప్ప సత్య స్వరూపమును, పరిపూర్ణ, ఆద్యంతరహిత స్వరూపమును, ఇచ్చట "అదః," అది అను సర్వనామముతో తెలుపబడియున్నది. ఇట్టి ఉపయోగమున ఒక గొప్ప ప్రాముఖ్యతయును, నిర్ణీత కార్యభావమును తెలియవచ్చును.

ఒక శిష్యుడు తన జీవితమును, తేజోవంతముగను, పరిపూర్ణముగను జీవించి, ఈ జీవిత దృశ్య ప్రవాహమున, నిరంతర బాధలను అనుభవించి, పరిపక్వదశ పొందినవాడై, ఒక గురువును సమీపించి, ఈ జీవిత సమస్యయంతయు బాధలతో, మరణముతో ముగియవలసినదేనాయని ప్రశ్నించతలచును. ఇట్టి బాధలతో ఈదులాడుచు అగాధ మరణ మంటలో పడవలసినదేనా? లేక వేరేదైన ఉన్నత ఆశయము గమ్యస్థానమొకటియున్నదా? అని ప్రశ్నించును. అన్వేషకులు బాలురైనయెడల వారి బుద్ధి స్వయముగా ఈ విషయములను కప్పియుండు దుప్పటిని తెరచి, లోనున్న సత్య స్వరూపమును స్వప్రయత్నమువల్ల తొంగిచూడజాలరు.

ఇప్పుడు గురువు ఉత్తరమిచ్చినాడు. అతని ఉత్తరము, ఆ గొప్పదగు గమ్యస్థానమును తెలుపుచు అందు ప్రకృతియొక్క సూక్ష్మ వ్యవహారములను తెలుపుచున్నది. అట్టి గొప్ప గమ్యస్థానమును శిష్యునికి తెలుపుటకై ఇచ్చట "అది" అను సర్వనామమును ఉపయోగింపబడియున్నది. "ఓ శిష్యుడా! నీవు ఏ గమ్యస్థానమును గురించి ప్రశ్నించితివో "అది." ఆ గమ్యస్థానము పరిపూర్ణమైనది" అని. అన్ని ఉపనిషదులు చేయు ప్రయత్నమంతయు, "ఆ" ఆద్యంత రహిత శాశ్వత గమ్యస్థానమును, పరిమితికిలోనైన భాషమూలమున తెలుప ప్రయత్నించుచున్నవి.

సత్య పరమాత్మ ఒక సమవ్యాపక పరిపూర్ణము. సత్య స్వరూపునియందు అధిష్టానముపొందిన ఈ బాహుళ్య ద్వంద్వములన్నియు అధ్యాసము. కాబట్టి, ఇవన్నియు కూడ పరిపూర్ణము. నిశ్చితముగ, ఈ పరిపూర్ణమంతయు ఆ పరిపూర్ణమునుండి ఉద్భవించియున్నది.

ఒక వస్తువునుండి మరియొక వస్తువు జనించినప్పుడు, కారణాంశమున యొక నిర్ణీతమార్పు చెందును. దానివల్ల కార్యఫలము సంభవించుట అనుకూలపడుచున్నది. ప్రపంచమున జరుగు వ్యవహారమిట్టిది. మన్ను పేరును, రూపమును మార్పుచెంది కుండయగుచున్నది. ఒక స్వర్ణముక్కనుండి స్వర్ణహారము తయారుచేయబడినప్పుడు స్వర్ణపుముక్క మార్పుచెందుచున్నది. ఒక చెట్టు పూర్తి ఆకారము పొందగనే, గింజ జీర్ణమగుచున్నది.

అటులనే, ఈ పరిమితిచెందిన బహుళ ప్రపంచమంతయు, ఏక, మహా ఆద్యంతరహితునినుండి ఉత్పన్నముకాగా, బహుశా, కారణాంశమున, ఇట్టి కార్యఫలము కలుగుటవల్ల, నశియించియుండవచ్చును. ఇట్టి సందేహమును నివర్తిపరుచుటకై ఈ ఉపనిషదుఋషి "ఈ పూర్ణమును, ఆ పూర్ణమునుండి తొలగించగా, పూర్ణమే మిగిలియుండును" అను వాక్కును దృఢ

ముగా పలుకుచున్నాడు. నిజముగా ఇట్టి భావము సాధారణ జీవిత అనుభవమునకు విరుద్ధముగానున్నది. - ఒక వస్తువునుండి మరియొక వస్తువు జన్మించగా, కారణము అగత్యము మార్పుచెంది కార్యఫలము ఏర్పడు చున్నది.

ఒక శాస్త్రము ప్రత్యక్ష అనుభవమునకు విపరీతముగా తెలుపునప్పుడు, వేదాంతి శాస్త్రవాక్యములను వాఖ్యార్థముతో గమనించక, లక్ష్యార్థమును వెదకి అందలి చక్కని ముఖ్య విషయమును గమనించవలెను. కనుక, ఇచ్చట ఒక ఆద్యంతసహిత విషయము, ఆద్యంతరహిత విషయమునుండి ఉత్పన్నమైనపుడు, ఆద్యంతరహితవస్తువు ఎట్టి మార్పుచెందక ఎట్టి మలినముపొందక, యుండును అని ఋషి తెలుపుటలో, అట్టి సృష్టియందు ఒక్క ప్రాముఖ్యత యుంటున్నది. ఈ ప్రపంచమంతయు ఒక సృష్టి కార్యము కాదు అను వేదాంత సిద్ధాంతమును సమర్థించుటకు, అన్ని ఉపనిషదులయందును ఆధారములున్నవి. ఈ ప్రపంచమునకు, సత్య స్వరూపునికిగల సంబంధము, కారణమునకు కార్యమునకుగల సంబంధమువంటిదికాదు.

పూర్వకాలపు ఋషులు నేటికాలపు ఆచార్య పురుషులు వేదాంత గురువులందరును, ఏకీభావముతో ఈ విషయపూరిత ద్వంద్వ ప్రపంచమంతయు సత్య స్వరూపునియందు అధిష్టింపబడియున్నదని తెలుపుచున్నారు. భూతమును కనుగొనినప్పుడు కూచమునకు ఎట్టి మార్పును కలిగియుండలేదు. అటులనే ఈ పరిమితిగల ప్రపంచము పరిమితికి మించిన సత్యమునందు ఉత్పన్నమయినపుడు, ఆ పరిమితిలేని సత్యమునకు ఎట్టి మార్పును కలిగియుండలేదు. కనుక, పరిమితికి మించిన సత్యస్వరూప జ్ఞానోత్పత్తి పొందినవెనుక, ఈ పరిమితికిలోనైన ద్వంద్వ ప్రపంచ దృశ్యమంతయు మాయమగుచున్నది. "ఆ" పరిమితికిమించిన సత్య స్వరూప మొకటియే 'పూర్ణము'గా నిలిచియుండును.

ఇట్లు గురుశిష్యు లిరువురును, ప్రతిదిన విద్యాభ్యాస ప్రారంభమున, వారియొక్క స్వస్వరూప నిత్యత్వమును జ్ఞప్తికి తెచ్చుకొనుచు, సత్యానుకూల ప్రవర్తనకు యోగ్యత గాంచుచుండిరి. దివ్యపదవికి యోగ్యత పొందగోరి, ఆ దైవమును జ్ఞప్తికి తెచ్చుకొనుట, అతని ప్రభావములు తలచుకొనుట, రూప గుణములను ఎన్నుకొనుట యంతయు, చక్కని ప్రార్థన కార్యమని తలచబడుచున్నవి.

ఇట్లు, జతగా ప్రార్థించి ఆ శాశ్వత సత్యస్వరూపుని ఉన్నత ఆశీర్వాదములను పొందగలుగుచుండిరి. మరియు, అతని కరుణకు యోగ్యులై బాహ్య అభ్యంతర దురితములనుండి రక్షింపబడుచుండిరి.

ఈ ప్రార్థన పాఠము అనివాక్యముగా త్రివిధ శాంతి వాక్యములతో అనుబంధింపబడి యుండును. ఇట్లు శాంతి వాక్యములను మూడు పర్యాయములు తెలుపుట వలన సాధకులు గురువుపాదములవద్ద శ్రుతులు అధ్యయనము చేయునపుడు మూడు విధ విఘ్నములు రాకుండుటకు చేయుప్రార్థన అని ఆచార్య పురుషులు తెలుపుచున్నారు.

ఒక విధ విఘ్నములు, అదృశ్య కారణములనుండి రావచ్చును. ఒకవిధము దృశ్యకారణములనుండి రావచ్చును. మరియొకటి మన అంతరంగమున కలుగు విఘ్నములు. ఇచ్చట ఇట్టి విఘ్నములన్నియు శాంతి రూపమున ప్రకాశించి, తాత్కాలిక విద్యాభ్యాసము సఫలముగను, నిర్విఘ్నముగను జరుగుటకు తోడ్పడవలెనని నిర్బంధించ బడుచున్నవి.

ఇట్టి శాంతి ప్రబోధానంతరము గురువు తాను కనుగొనిన సత్యస్వరూపాను భవములను, వక్కాణించ మొదలుపెట్టుచున్నాడు. ఇదియే ఉపనిషదు నందుండు యావత్తు విషయము. ఈశావాస్యోపనిషదు నందుగల ఆలోచనల ప్రవాహమంతయు, అయిదు అలల రూపమున, గమ్యస్థానము చేర, పరుగిడుచున్నది. ఇందు భావములన్నియు అతిక్లుప్తముగా తెలుపబడియున్నవి. కాని అందు వేదాంత వాఙ్మయమంతయు ఇమిడియున్నది. ఆలోచన ధోరణి అతి ఉన్నత భావములతో యున్నది. దివ్యముగా సమకూర్చబడియున్నది. శాస్త్రసమ్మత క్రమమునననుసరించి యున్నవి.

అంమువల్ల, ఆతురతో చదువుపాఠకులకు ఈశావాశ్యోపనిషదు నందలి భావములన్నియును భ్రమ కలిగించువాక్యములనియు, భావలోపముగలిగి, పూర్తి భావములు తెలుప జాలకున్నవని తోచగలదు.

ఇట్టి తీర్మానము విదేశీయ చర్చకులకు కలుగుట సర్వసాధారణ విషయముగానున్నది. ఎందుకన, ఒకొక్క నూతన సాధకుడు ఈశ్రుతియొక్క బహిర్ద్వారము చేరుచుండగనే, ఇందలి భావనుచూచి దిగ్భ్రమ చెందుచున్నాడు. ఈ ఉపనిషదునందు తెలిపియుండు భావములు, అతిచనువుగా అగుపడినను, వాటి ప్రతి మంత్రమునందును విశేష ప్రాముఖ్యత, వ్యాఖ్యాన బాహుళ్యములు కలిగియున్నవి.

పైన తెలిసిన అలలయందు తొలుత సత్యసిద్ధాంతమును తెలుపుచు ఋషుల భావములను ప్రకటించు ఒక అధ్యాయమువలెనున్నది. ఆ సత్యమును సన్యాస మార్గమున ఎట్లు పొందనగును? అట్లుతెలుసుకొనిన సత్యమును స్థిరతరముగా పొంది యుండు టెట్లు? చక్కని జీవిత అనుభవసుఖమును పొందుటెట్లు? తుచ్ఛగౌరవమును, అస్థిరజయములను, విషయ సంపదలను త్యజించిన త్యాగజీవితము గడుపుట ఎట్లు? అను విషయములను తెలుపుచున్నది.

రెండవ అలయందు ఋషులు, కర్మమార్గమును తెలుపుచున్నాడు. ఋషుల నిర్దేశప్రకారము సన్యాస మార్గమును అవలంభింపలేని మిగతవారందరు ఈ కర్మ మార్గమును అవలంభింపవలసియున్నది. మూడవ మంత్రమున, ఇట్టిసూచనతో తృప్తిపడక, పైరెండు మార్గములు త్రొక్కనివారు మార్గభ్రష్టులై అంధకార దుఃఖ పాతమున పడుచున్నారనికూడ తెలుపుచున్నారు.

మూడవ అలయందు, ఋషులకవిత్వచాతుర్యము ఉప్పొంగి, అనేక చిత్రవర్ణములతో, మొదటి శ్లోకమున తెలుపబడిన జీవిత గమ్యస్థాన వర్ణనమును విపులముగా చిత్రింపబడుచున్నది. అట్టి పదవిని పొందిన వారు అటుపిమ్మట అంతర ప్రపంచమున సత్యానుభవమును ఎట్లుపొందుచున్నారో తెలుపబడుచున్నది.

ఇట్టి కర్తయొక్క ఆద్యంతరహితగుణములను తెలుపు మంత్రముల వెనుక, ఆరు శ్లోకముల పర్యంతము నాలుగవ అల వ్యాపించియున్నది. అచ్చట, జ్ఞానము, కర్మము (ధ్యానము. పూజ) రెండును జతగా ఉపయోగపరచిననే పూర్ణ ఫలము పొందనగునని శిష్యునికి గురువు తెలుపుచున్నాడు. వీటిలో ఒకటి విడిచి ఒకటిని మాత్రము అభ్యసించకూడదు. కాని వీటిని వొకదానివెనుక నొకటిని, నమ్మకముతో ఉపయోగించిన కార్యక్రమము శాంతముగా పూర్తిగా నెరవేరగలదు. అప్పుడే వీటిలో ఒకదానిచే మరియొకటి బలవంతరమై, ఐక్య సమ్మేళన పొంది రెండవదానిని తేజోవంతముచేయగలదు. ఇట్లు ఒకటికొకటి బలము కలిగించుచు కడకు రెండును చేరి సాధకుని, ఆత్మసాక్షాత్కారము, లేక ఆత్మఎరుకను పొందించును.

కడపటి నాలుగు శ్లోకములు కలసి అయిదవదియగు కడపట అలగానున్నది. ఇందుమానవుని తనయందు నెలకొనియున్న అమృత స్వరూపమైన తనవైభవమును దర్శించవలెననియు, తన ఆనంద స్వరూపమును తాను ఆత్మానుభవమున పొందవలెనని శ్రుతికోరుచున్నది. ఇప్పుడు ఒకటి వెనుక యొకటిగా ఈ శ్లోకములను గమనించెదము.

ఓం శాంతిః శాంతిః శాంతిః

---

ఒంగోలు తాలూకా — ధేనువకొండలో 16-9-55 నాడు మహిళల క్లబ్ స్థాపించబడింది. అధ్యక్షురాలుగా శ్రీమతి నాగినేని వెంకటసుబ్బాయమ్మగారు, కార్యదర్శినిగా శ్రీమతి అన్నాబత్తిని ఆండాళమ్మగారు యితర కార్యవర్గ సభ్యులను ఎన్నుకోడం జరిగింది.

# తుమ్మముళ్లు

శ్రీ 'విజయ - రాఘవ'



"మల్లిఖార్జునరావు సంసారం చెడిపోవడానికి ముఖ్యకారకుడు బ్రహ్మాజీరావే" - సుబ్బారావు యీ మాటని యెన్ని వందలసార్లైనా విసుగులేకుండా అనగలడు.

"తన సంసారాన్ని తనే చేతులారా చెడగొట్టుకొన్నాడు. ఒకళ్ళనంటే యేమిలాభం వూరికే" రావమ్మ, సత్యవతి తిండితిప్పలు మానుకునైనా, యీ వార్తని పదిమందికి వెల్లడిచేయడానికి సాహసించగలరు.

"ఇదంతా కర్మ కాకపోతే, మరేమిటి చెప్పండి" శోభనాచలపతి పర్యవసానంగా భావించి, తూచి యీ వాక్యాన్ని సమయానుకూలంగావదలగలడు.

"ఎవర్నని యేమిలాభంలేదు" - అలివేలమంగ తాయారమ్మ, ఎవరన్నా ఆ సంసారాన్నిగూర్చి అడిగితే చెప్పేమాట యిదొక్కటే అదైనా స్థలాస్థల విచక్షణాజ్ఞానంతో.

"నాకెందుకీగోలంతా. నాకేమి చెప్పవద్దు. నేను వినలేను. యెవరికేమి చెప్పడానికి నాకేమి తెలియదు. ఎవరేడుపు వాళ్లేడుస్తారు. ఒకళ్లని గురించి మనకెందుకయినా ?" - రంగారావు ఉవాచ యింతకంటే యేమీలేదు.

♦ ♦ ♦

బ్రహ్మాజీగావు ఒకప్పుడు చాలా గౌరవంగా పెరిగిన పెద్ద మనుష్యులలో ఒకడు, అప్పుడా గొల్లపల్లిలో. యీ నాటికికూడా ఆ గౌరవాన్ని ఆధారం చేసుకొని వున్నాడన్నమాటేగాని అదంతా నగ్నసత్యానికి పైనపూసిన అల్యూమినియంపెయింట్ లాంటిది. బ్రహ్మాజీరావు మొదటినుంచీ రాజసము చూపి తాత్కాలికంగా బ్రతుకుపాగిస్తూంటేచాలని తృప్తిపడేవాడు. యీ భావంతో ప్రతి విషయములోకి అడుగుపెట్టి తనకేమి సంబంధములేకపోయినప్పటికి, చేతులారా చేసుకొని, తనేదో నిర్వాకముచేద్దామని వూనుకొంటాడు. తానుచేసేపనులలో తనకే ఒకొక్కసారి నమ్మకంవుండదు. అంతా తెలుసునని, అహంకారంతో ఆ పనిచేయడానికి మొదలుపెట్టి చివరిదశలలో పలాయనము చిత్తగించడము, ఆయనకు సహజంగా అలవడిన లక్షణాలలో ఒకటి. యీ లక్షణాలతోనే "మల్లిఖార్జునరావు సంసారం" చెడిపోయిందని రెండో అల్లుడు సుబ్బారావు అదే పనిగా మాట్లాడుతుంటంలో ఆశ్చర్యపడవలసిన అగత్యము యేమీలేదు.

సుబ్బారావు కచ్చితమైన మనిషి. అనదల్చుకున్న మాట మొహంమీద అనగలిగినమనిషి. బ్రహ్మజీరావు అందరింటికీ ఒకప్పుడు వస్తున్నమనిషే. ఎటొచ్చీ మూడుసంవత్సరాలనుంచీ సుబ్బారావు యింటికిరావడం మానేశాడు. అంతగా కన్నకూతురిని చూడాలనుకొంటే, సుబ్బారావులేని సమయంలో వచ్చి, కూతురు అలివేలమంగతాయారుని, పిల్లలిని చూసిపోయేవాడు. సుబ్బారావంటే సింహస్వప్నంగావుండేది. బ్రహ్మజీగావులో గుట్టు-పైగుట్టు తెలుసుకొంది నలుగురి అల్లుళ్లలో ఒక్క సుబ్బారావే. పెద్ద కూతురు రావమ్మ అంటే మొదటినుంచీ బ్రహ్మజీరావు దృష్టిలో చాలా తెలివయిందని, యేవిషయానైనా ఆలోచించి నలుగురికి నచ్చేలాగు చేస్తుందని, దానివలనే తనకింతవరకూ పేరు ప్రతిష్ఠలు నిలిచివున్నయ్యని" తన చుట్టూ చేరినవాళ్లతో వుబ్బితబ్బిబై చెప్పుకోవడము బాగా అలవాటయింది. యీ అలవాటుకి సమయా సమయ విచక్షణాజ్ఞానం పూర్తిగా వెనుకంజవేసివుంటుంది. సిగ్గు - లజ్జ కేవలం నామమాత్రంగానే ఆయనపట్ల.

రావమ్మ పెళ్ళిచేసినట్లు యీ ప్రపంచంలో,

అందులో బ్రాహ్మణకులంలో ఎవ్వరూ అంత బాగా చెయ్యలేరంటాడు. ఎంతవరకు యీ విషయము నమ్మదగిందో ఆయన సమకాలికులకే యెరుకైవుండాలి. తాను బంధువులలో యెంతసేపూ కలిసి - మెలిసి వుండాలనే దృక్పథంవున్నదని, నలుగురి కూతుళ్లకు పరాయి సంబంధముచేయకుండా చూడాలని, ఆ రోజులలో పలికినమాట వాస్తవమే. యీ వాస్తవానికి యెంతవరకు రాను రాను సన్నిహితుడయ్యాడో తెలుసుకోవలసిన బాధ్యత ఆయనంటే పడిచచ్చేవాళ్లకు కనీసంవుండాలి. బ్రహ్మాజీరావంటేనూ, అతని మాటంటేనూ, ఆ రోజులలో గొల్లపల్లి యెస్టేటు మంచి ఉచ్ఛదశలో, పలికింది అక్షరాల నిజం అని, పట్టింది బంగారమని యెంచుతూ వచ్చారు కొంతమంది. యీ యెంచడానికి ముఖ్య కారణము యెంతో దూరమయిందికూడా కాదు; ప్రసాదరావే లేకపోయినట్లయితే బ్రహ్మాజీరావెవరు ? మహా అయితే ఒక సామాన్యవ్యక్తిగానో, లేకపోతే రామకోటి వ్రాసే వాళ్ళలో ఒకడుగానో పరిగణించబడేవాడు. అంతేగా !

## 2

ప్రసాదరావు జగమెరిగినవ్యక్తి. ముక్కుకి సూటీగాపోవడమే లక్ష్యంగలవాడు. ఎక్కిరి తక్కిరి మాటలంటే మండిపడే మహోగ్రమూర్తి. "ప్రసాదరావా ! దూర్వాసుడంతటివాడోయ్" అన్న మాటలు నేనూ వినలేకపోలేదు. కాని, అంతటివానితో నాకేమిపరిచయంవుందని, ఆయన గొప్పతనాన్ని ఆత్మీయులమాదిరిగా గ్రహించగల్గుతాను! ఎంతఆత్మీయున్నైనా బంధువర్గంలోకల్లా ఆయననుకొన్న ఆత్మీయులలో ఒకన్నిగాను.

నాదెళ్ళవారి వంశానికి, కొండపావులూరు స్వస్థానం. నండూరివారికి - నాదెళ్ళవారికి చాలా దగ్గర బాంధవ్యంవుంది. కాని బ్రహ్మాజీరావు దృష్టిలో నాదెళ్లవారు ప్రతి విషయములోనూ వెనక్కులాగే మనుష్యులని - సాహసము తక్కువవారని అభిప్రాయము.

నండూరివారి స్వస్థానం అల్లాపురము, యింకా మరికొన్ని వూళ్లుకూడావున్నాయి. జానకిరామయ్యగారికి ముచ్చటగా ముగ్గురే కొడుకులు. ఒక్కతే కూతురు. పెద్దవాడు శరభయ్య, రెండోవాడు బ్రహ్మాజీరావు, మూడవవాడు విశ్వనాథం — గతించాడు. బ్రహ్మాజీరావు పెంపుడుగావచ్చాడు.

చివరకు శరభయ్య సంసారము చెప్పుకోతగిన స్థితిలోవుంది. విశ్వనాథం సంసారము చెల్లాచెదరయింది. శరభయ్య — విశ్వనాథం మొత్తానికి పేరు సంపాదించుకొన్న వ్యక్తులక్రింద జమకట్టాలి. బ్రహ్మాజీరావుకి మొగపిల్లలులేకపోతే విశ్వనాథం మూడవ కుమారునిని 'రామకృష్ణ'ని పెంచుకొన్నాడు. రామకృష్ణకి సంగీతము అంటే చెవికోసుకోవాలనిపిస్తుంది. చక్కగా పాడగలడు. నాటకాలు — సినిమాలు అంటే మోజుగలవాడే. యీ కాలంలో యీ మాత్రము మోజైన యోగ్యతాపత్రము సంపాదించుకోకుండా యెవడుంటాడు ? పెంచుకొన్న తొలిరోజులలో బ్రహ్మాజీరావు రామకృష్ణని గురించి కొంచెము బాధపడ్డాడు. తరువాత ఆ బాధలోంచి వాత్సల్యం పుట్టుకురావడము మొదలు పెట్టింది.

"రామకృష్ణ"ని బ్రహ్మాజీరావు పెంచుకొంటున్నాడంటే, యిందులో యేదో అంతరార్థంలేకుండా వుండదు. అది యేదైవుంటుంది ! అని శరభయ్యకు కొంచెము సందేహముకలిగింది. శరభయ్యకు బ్రహ్మాజీకి కొంతకాలమునుంచీ మాటా — మాటామీద పెడసరంతో మాట్లాడుకోవడము మానివేశారు. శరభయ్యకూడా జానకిరామయ్యలాగా పట్టుదలమనిషే. అల్లాపురము గ్రామములోగాని, చుట్టుపట్ల గ్రామాలలోగాని, యీనాటికి ఆయనపేరుచెబితే చేతులెత్తి దణ్ణాలుపెట్టకుండా ఎవ్వరూవుండలేరు.

విశ్వనాథం చాలా సాధుమయుడు. శాంతస్వభావుడు. కొండవిరిగిమీదపడ్డా "ఫరవాలేదులే" అని భావించేవాడు. కన్న కొడుకులలో రెండోవాడు సుబ్రమణ్యశర్మ మెట్లపల్లివారికి దత్తత వెళ్లాడు. మూడవవాడు బ్రహ్మాజీరావుగారి 'రామ

కృష్ణ. పెద్దవాడు లోకప్రకాశరావు. చాలా బంధుప్రియుడు. అనురాగాల రాశీభూతుడు. కాని విపరీత కామోద్రేకితుడు. చివరకు అతని జీవితము అంకితమయిందికూడా యీ ఉద్రేక కారణాలకే. ఉన్న కూతుళ్లలో మంగమ్మ, చిట్టెమ్మ వారి కాపురాలువారు నిర్విఘ్నంగా సాగించుకొంటున్నారు.

శరభయ్యకు గలిగిన సందేహము, రోజులు గడుస్తున్నకొద్దీ నిజమవుతూవచ్చింది. రావమ్మ పెద్ద కూతురు అరుంధతిని — రామకృష్ణకిచ్చి వివాహము చేయాలని బ్రహ్మాజీరావు తలపెట్టుకొని కూర్చున్నాడని, రావమ్మకీర్తికి యీ నాటినుంచీ నాందీప్రస్తావన జరిగిందని అనుకోవడము బాగా వ్యాప్తికొచ్చింది.

3

రామకృష్ణకి అరుంధతికి వివాహము జరిగింది. అయిన సంబంధము వెతుక్కోకుండా దొరికిందని ముచ్చటగా పెద్ద కూతురుకి పెళ్ళిచేసింది రావమ్మ. యిదివరకటికన్నా నాదెళ్లవారితో సంబంధ భాంధవ్యాలు విపరీతంగా పెరిగిపోయాయి. యిలా యేనాటికానాటికి కలవకపోతుందా అనే వుద్దేశ్యంతో శరభయ్య ముందుగానే, వున్న ఒక్క కూతురు సీతమ్మను శోభనాచలపతి తమ్ముడు సీతారామయ్యకిచ్చి వివాహము చేసాడు. యీ చేయడమే రామకృష్ణ పెళ్లికి యీ నాడు ప్రాతిపదిక అయింది. రావమ్మకి ఆరుగురు ఆడపిల్లలు, ముగ్గురు మొగపిల్లలు.

బ్రహ్మాజీరావు క్షణక్షణంకి మారేవ్యక్తి కాబట్టి యీ సారి రెండో కూతురు అలివేలమంగకి మంచి సంబంధము తేవాలని కుతూహలపడటంతో, మంతెనలో మానికొండవారి వంశముమీదికి కన్ను విసిరాడు. సుబ్బారావు మానికొండ వెంకటేశ్వరరావుగార్కి ఒక్కడేకొడుకు, ఒక్కతే కూతురు సీతారాం. వెంకటేశ్వరరావు నలుగురి అన్నదమ్ములలో రెండోవాడు. మహాకవి; హరికథకుల్లో అఖండవిద్యావంతుడు, మృదంగ ప్రవీణుడు. సామాన్య కుటుంబీకుడైనా గౌరవముగా బ్రతుకుతున్నవారిలో జమకట్టవలసినమనిషి. వెంకటేశ్వరరావు, నండూరి జానకిరామయ్య సోదరుడు రామకృష్ణయ్యగారి పెద్ద కూతురు రాజ్యలక్ష్మమ్మకు భర్త. యీ సంబంధము తనకు నచ్చేటట్లువుందని ఒకనాడు మంతెన గ్రామానికివచ్చి వెంకటేశ్వరరావుగారితోను, ఆయన అన్నదమ్ములతోను సంప్రదించి సుబ్బారావుకి అలివేలమంగ నివ్వడానికి నిశ్చయంచేసుకొన్నాడు. సుబ్బారావు అప్పటికి విజయవాడ మునిసిపల్ హైస్కూల్లో స్కూల్ఫైనలు చదువుతున్నాడు. అనుకున్న లగ్నానికి హట్టహాసంగా సుబ్బారావు తరఫువారు కేసరపల్లిదగ్గరకొచ్చి మేళతాళాలతో, బాజాభజంత్రీలతో కోలాహలంగా పడవలు మాట్లాడుకొని బయలుదేరారు. పెళ్ళిమండపం కట్టింది పెరికీడులో, ప్రసాదరావు స్వగృహంలో దివ్యతేజో విరాజమానంగా అలివేలమంగకి — సుబ్బారావుకి వివాహము జరిగింది. మరుసటి సంవత్సరము దరిదాపుల్లో మూడవకూతురు సత్యవతికి, గొల్లనపల్లివారి వంశీయుడైన సత్యరంగారావుకిచ్చి వివాహముచేసాడు.

బ్రహ్మాజీరావు పెద్దల్లుడు శోభనాచలపతికి కొండపావులూరి కరిణీకం వంశపారంపర్యంగా వస్తోంది కాబట్టి, తాను చేయనని తప్పుకొంటానికి వీల్లేకపోయింది. యీనాడంటే దానికి విలువకట్టడము లేదుగాని, ఆ రోజులలో కరిణీకం అంటే అదో రకమైన ఉన్నతపదవే. సుబ్బారావుకి మునిసిపల్ హైస్కూలు చదువు పూర్తవటము తరువాయిగా, గొల్లపల్లి యెస్టేటులో, జమిందారుగారైన శ్రీరంగయప్పారావుతో సంప్రదించి బ్రహ్మాజీరావు—ప్రసాదరావు మంచి వుద్యోగము సంపాదించిపెట్టారు. ఇల్లరికపు అల్లుడనిపించుకోకుండా సుబ్బారావు వేరే కాపురము గొల్లపల్లిలోనే, వరదాచార్యుగారి యింటి ప్రక్క, దేవాలయము ప్రహరీగోడ వెనుక బజారులో మంచి యిల్లుచూసి కాపురముపెట్టాడు. బ్రహ్మాజీరావు పలుకుబడి మూడుపూవులు లారుకాయలుగావున్నా, సుబ్బారావు మాత్రము మామగారి

సహాయము కోరకుండానే జీవితము గడుపుకొంటున్నాడు. జమిందారుకి సుబ్బారావంటే అమితమైన అనురాగము — నమ్మకము యేర్పడ్డవి. తానెక్కడికి వెడుతున్నా సరే సుబ్బారావు వెంటవుండి తీరాల్సిందే !

రెండోకూతురు కాపురముకూడా యీ విధంగా యేర్పడిన తరువాత, ఆ తరుణంలోనే రంగారావు చదువు పెరిగి పెద్దదై కాలేజీ ఆవరణలోకి అడుగు పెట్టింది. యింతవరకూలేని గౌరవ ప్రమత్తులు బ్రహ్మాజీరావుకి ఒక్కసారిగా, ఉక్కిరి బిక్కిరయ్యేట్టు ముంచుకొచ్చాయి. రంగారావు ప్రయోజకత్వాన్ని వేనోళ్ళ పొగడినట్లు పొగడేవాడు. సుబ్బారావుకి యిటువంటి స్తుతిపాఠాలు వినాలంటే మహా చిరాకు. అసలు అరికాలిమంట నెత్తికొస్తుంది. "ఎంతచెడ్డా! పిల్లనిచ్చిన మామగారు" అన్నమాట ఒకటి అభిమానంగా వుంటూవచ్చేది. ఒకటి రెండు సార్లు ఆ అభిమానాన్నికూడా తృణీకరించి "చాల్లెండి! అనవసరంగా, రంగారావు గురించి, నాముందు పొగడకండి. మీకెంతో గౌరవము వుండే వుండొచ్చు. కాదనను. కాని, ప్రతిదానికి అతన్ని గురించి నా మొహముమీద యేమిమాట్లాడొద్దు" అన్నాడు. అలా అంటే మాత్రము బ్రహ్మాజీరావుకి సిగ్గా — యెగ్గా! మానడానికి — తాత్కాలికంగా ఆగిపోగలడుగాని, సర్వకాల సర్వావస్థల్లో పీఠంవేసుకొని కూర్చొన్న ఆ భావం యెలా తొలగిపోతుంది.

రెండోకూతురు అలివేలమంగంటే బ్రహ్మాజీరావుకి గలిగిన సంతానములో చెప్పుకోదగినవ్యక్తి. నిండుకుండ స్వభావముగలది. యెన్ని వుపద్రవాలొచ్చినా తలవంచుకొని వెళ్ళిపోయేమనిషి. మిగతావాళ్ళను మల్లే అడుసుత్రొక్కి కాళ్లు కడుక్కోవడం, చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకోవడములాంటి అలవాట్లకు అలవడిన ఆడమనిషి అలివేలమంగకాదు. అందువల్ల బ్రహ్మాజీరావుకి అలివేలమంగ అంటే అమితమైన నమ్మకమువుంది. చాలా అమాయకపురాలని కూడా వుద్దేశము. వాస్తవంగా అలివేలమంగ అంతరాత్మను అవగాహనచేసుకోగలిగిన ఆత్మీయురాలు కన్నతల్లి రాజ్యలక్ష్మమ్మే.

4

మొదట్నుంచీ రావమ్మ, సత్యవతి ఒక తరగతిలో చేరినవారు. అలివేలమంగ ఒక్కతే వేరే తరగతి. ఒకళ్ళ సంసారాల్ని దుమ్మెత్తిపోయడానికి సత్యవతి, రావమ్మ చాలావరకు సాహసింపగలరు. యీ సాహసానికి ప్రబల కారణము బ్రహ్మాజీరావే. సత్యవతికి చుప్పనాతితనం, యీర్ష్య యిటువంటివి పుట్టుకతోనేవున్నాయి. చిన్నప్పటినుంచి రావమ్మగార్కి యీ లక్షణాలన్నీ యించుమించుగానే వున్నాయి గాని, గౌరవముగా వాటిని చూపుతూంటుంది. ఒకళ్ళ యింటిమీదపడి తినడమంటే సత్యవతికి చాలా యిష్టమైనపని. "నీతోనే యీపనివుంది, లేకపోతే యెట్లాగంటే" ములగచెట్టు చిటారుకొమ్మ మీద కూర్చొంటుంది. తన భర్త రంగారావుముందు, సాటివాళ్లెవరూ లేరంటుంది. యీ పాఠము తిరిగి యిట్లా వర్ణించడం, బ్రహ్మాజీరావు వ్రాసియిచ్చినదే. బూటకపు మాటలతో మనుష్యుల్ని నమ్మించి, మోసముచేయడములో చాలా సిద్ధహస్తురాలు. బ్రహ్మాజీరావుకున్న గుణాలన్నీ మళ్ళా నేర్చుకుంది, ఆయన కూతుళ్లలో ఒక్క సత్యవతే.

రావమ్మ సంసారము కొండపావులూరులోను, అలివేలమంగ కాపురము రమణక్కపేటలోను, సత్యవతి బెజవాడలో గవర్నరుపేట చెట్లబజారులోను కాపురముచేసుకొంటూ కాలము గడుపుతున్నారు. అలివేలమంగకి ముగ్గురాడపిల్లలు — ముగ్గురు మొగపిల్లలు. సత్యవతికి నలుగురాడపిల్లలు. పోతే సరోజిని బ్రహ్మాజీరావుగారి నాల్గో కూతురు. ఆవిడను గురించి నెమ్మదిగా ప్రస్తావిద్దాము.

శోభనాచలపతి కరణీకము దివ్యచకోరములాగా వుంది. సుబ్బారావు మాత్రము గొల్లపల్లి ఎస్టేటు పతనానంతరము రమణక్కపేటలో ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ, బ్రతుకుతున్నానంటే బ్రతుకుతున్నాననే వుద్దేశ్యంతో కాలక్షేపంచేస్తున్నాడు. రంగా

రావు బ్రహ్మయ్యండుకో ; విజయవాడలో ఆడిటర్ వెలగబెడుతున్నాడు. ఎవరిబుద్ధు లెటువంటివో బాగా తెలుస్తూవస్తూన్నా ఒకరింటికొకరువస్తూ, పోతూండటము జరిగిపోతూనేవున్నాయి. బ్రహ్మాజీరావు మాత్రము రమణక్కపేటకు చాలా తక్కువగా వస్తూండేవాడు.

ఇటువంటి పరిస్థితులలో బెజవాడలో మాచవరం దగ్గరోవున్న కొన్ని యిళ్లస్థలాలు చాలా చవుకబారుగా అమ్మకానికి వున్నయ్యని, బేరమాడటానికి బ్రహ్మాజీరావు, సుబ్బారావు ప్రభృతులు రావడము జరిగింది. స్థలాలు చూచుకోవడము నచ్చినయ్యని తృప్తిపడటము జరిగింది. సుబ్బారావు ఆరువందల నలభై గజాలు స్వంతంగాకొన్నాడు. బ్రహ్మాజీరావు సుబ్బారావు స్థలానికి దక్షిణంగా మూడువందల చిల్లర గజాలు, ఆయనకు దక్షిణంగా రంగారావుకి మూడువందల గజాలుకూడా బ్రహ్మాజీరావే కొనిపెట్టాడు. రెండో కూతురు – మూడో కూతురు యిళ్లమధ్య తనుండాలనుకొన్న బెంగ తీరిపోయింది.

కొడుకుల చదువు నిమిత్తము సుబ్బారావు నెమ్మదిగా రమణక్కపేటనుంచి గన్నవరముకి మకాం మార్చాడు. 1950 సంవత్సరము చివరి రోజులలో మాచవరములో యిల్లు కట్టుకోవడము – గృహప్రవేశము వగైరాలు జరిగిపోయాయి. సుబ్బారావు యీ యిల్లు కట్టేముందు, తనవద్ద ఒక మంచి గేదొకటి వుంటే బ్రహ్మాజీరావు దాన్ని అడగటం – తోలుకొనివెళ్ళడం జరగింది. మర్యాదకోసం కొన్నాళ్లు, మామగారనే పెద్దమనిషి తరహాతో కొన్నాళ్లు, ఆయననుండి రావలసిన పైకముకోసము కొన్నాళ్లు, వేచివుంటూవచ్చినందుకు రాను, రాను ఆ ఆశ నిరాశగా మారిపోయింది.

సుబ్బారావుకి వొళ్ళంతా తేళ్ళు కుట్టినట్లయింది. బ్రహ్మాజీరావు సంగతి మొదటినుంచి తెలిసినప్పటికీ మొగమాటంమీద, ప్రసాదరావు మొగంచూసి యింత కాలంచూసి వూరుకున్నాడు. సరిగ్గా యిల్లు కట్టుకుంటున్నాననుకున్న సమయానికి ఒకసారి బ్రహ్మాజీరావు వున్నట్టుండి వూడిపడ్డాడు. సుబ్బారావు మాటల సందర్భంలో తన వుద్దేశాన్ని వ్యక్తము చేసాడు. బ్రహ్మాజీరావు సంతోషపడినమాట వాస్తవమే. కాని, ఆ సంతోషములో వొళ్లు తెలియక తాను చేయదల్చుకున్న సహాయము శ్రావణమాసము వెళ్ళిన తరువాత తప్పక చేస్తానని వాగ్దానము చేసాడు. సుబ్బారావుకయితే నమ్మకము లేదుగాని, అలివేలుమంగ ఆశ్చర్యపడింది. అయినా యీ సారీ చూద్దాం అనే భరోసామీదే కేవలము ఆధారపడివుండకుండా, చేయదలచుకొన్నపని చేసుకొంటూనే కాలము గడుపుతున్నాడు.

## 5

"సుబ్బారావు యిల్లుకట్టుకుంటాడు–తనకు తోచిందేదో సహాయము చేస్తాననేమాటకూడా యిచ్చాను. సరిగ్గా ఆ సమయానికి నా సహాయము అందేటట్లులేదే" అని బ్రహ్మాజీరావు సందేహిస్తూనే మొగము చాటేసి, ఎన్ని కబుర్లుపంపినా, జవాబివ్వకుండా కాలము గడుపుతున్నాడు. ఇల్లు కట్టవలసిన సమయము సమీపిస్తుంది.

బ్రహ్మాజీరావు సహాయము నానాటికి వెనక్కి లాగుతోంది. కాని సుబ్బారావు యీ నిశ్చయము గురించి యెక్కువ మధనపడలేదు. ఎలాగైతేనేం మంచి ముహూర్తము ఒకటి పెట్టించి మాచవరము స్థలములో శంకుస్థాపనచేసాడు. బ్రహ్మాజీరావు రాలేదు. సుబ్బారావు, తన తరఫువారి అభివందనాలతో గృహప్రవేశము జరిగింది. ఆ నాటినుంచి యేశుభసమయ సందర్భములోకూడా బ్రహ్మాజీరావుని ఆహ్వానింపరాదని నిశ్చయము చేసుకొన్నాడు.

(సశేషము)

# జీ వి త ము

(అరవం నుండి అనువాదం)

శ్రీమతి యం. లక్ష్మీదేవి

——(౦)——

లౌకిక జీవితమును పరిశీలించుటే ఉన్మాదత్వము. ఇష్టాయిష్టములకు, కష్టసుఖాలకు మధ్య జీవితప్రవాహం వేగంగానో, లేక నిదానంగానో, ప్రవహిస్తుంది. నిముషానికి నిముషం పరిణామం! ఊహాతీతమైన అగాధం! విషాద విచార వీచికలతో ఉప్పొంగుతుంది సముద్రంలాగు. ఎంత వినోదమైంది జీవితం! దాన్ని పూర్తిగా తెల్సుకొన్నవారున్నారా! జీవితం యొక్క ఉద్దేశమేమి? ఎంత మంది జనులు 'జీవితం' అను పదానికే అర్థం తెలియకుండ జీవిస్తున్నారు? ఎంతమంది అసంపూర్ణంగా ఊహించుకోగలిగారు? తన్ను గూర్చిన అర్థాన్ని పరిశీలించేవారికి ప్రత్యక్షంగా గోచరమైందా? ఒక వ్యక్తి "ఛీ ఇదేమి జీవితం'" అని ఈసడించుకొంటాడు. ఇంకో వ్యక్తి "జీవితం సుఖమయం!" అంటాడు. ఏమి! జీవితం సుఖమయమా! లేక ఈసడించుకోదగ్గ 'ఛీ' అను భావ ప్రయుక్తమైనదా? జీవితం యొక్క అర్థమైతే యేమిటి?

నా వరకు నేను జీవితాన్ని తెల్సుకొన్నది ఒక జీవి జీవితం ఇంకొక జీవి జీవితాన్ని పరిపూర్ణమొందించుటే -అదే జీవితోద్దేశం. అయితే జీవితం క్షణభంగురం కాదు; శాశ్వతమైంది. ఒక జీవి దేహత్యాగం చేసిన తర్వాతకూడ అతని జీవితం మాత్రం శాశ్వతంగా ధరలో నిల్చిపోతుంది. ఆ జీవి యొక్క గుణావగుణములు మంచి చెడ్డలు అతని మరణానంతరమే చర్చింపబడి ఆదర్శప్రాయంగా అయిపోతుంది. అనేక శతాబ్దములు గడిచిపోయినప్పటికి ఇప్పటికి భారత రామాయణాది మహాగ్రంథములను చదివి నాయకానాయికల సుగుణములను ఆదర్శప్రాయంగా -లక్ష్యంగా-అమర్చుకొనుచున్నాముగదా!

ఒకడు దుష్టుడైనప్పటికి "దుర్యోధనుని వంటివాడు కంసునివలె కఠోరుడు"అనియు "తుగ్లక్ వలె పిచ్చివాడు" అనియు చెప్పుకొంటారు. మంచివాడైతే "మహాత్ముడు-ధర్మరాజు వంటివాడు. శీలానికి శ్రీరాముడు" అనియు చెప్పుకొంటారు. వాడు మంచివాడైనా చెడ్డవాడైనా వాడి జీవితం మాత్రం ఆదర్శప్రాయంగా ప్రజ్వలిస్తుంది. జీవితానికి నాశనం లేదు. అది శాశ్వతమైంది.

ఉన్నత లక్ష్యం - విశాల దృష్టికలవారి జీవితం పూర్ణ ప్రవాహం వంటిది. నిస్తరంగమైన శాంతప్రవాహిని దగ్గిర మలయమారుత వీచికలతో 'హాయిగా వాహ్యాళి

చేస్తూంటే ఎంత హాయిగా ఉంటుందో అంతగా శీలత్యాగ ప్రేమ సంతుష్టాది గుణాలతో నింపిన వ్యక్తియొక్క జీవితం వివక్షింపబడినపుడు అంతటి పారవశ్యాన్ని కలుగజేస్తుంది. ఆ పరవశ శక్తియే జీవిత సౌరభం.

జీవితాన్ని పరిశీలింప పరిశీలింప అగాధ, అజ్ఞాత అద్భుత గర్భితమైన వినోదవస్తువు. పరిష్కరింపబడని, పరిష్కరింపరాని అద్భుత క్లిష్టసమస్య. దాన్ని పరిశీలించను ప్రయత్నించువారిని వెఱ్ఱిగాను, మూఢాత్ములుగాను, ఉన్మాదులుగాను చేసి విజయ గర్వంతో వికట హాసం చేస్తూ ఎండమావిలా మాయమైపోతుంది.

దైనందిన చర్యలలో లిప్తమైపోయి చీకాకు పడ్డ కొందరు మాత్రమే జీవితాన్ని పరిశోధించుకోగలరు. జీవితముయొక్క మిత్రము కాలం. కాలం తన తీవ్రగమనం చేతను మాయ మంత్రశక్తి చేతను మానవుణ్ణి మూఢుణ్ణి చేసివేస్తుంది. కాలం జీవితం పీట్ల చేతులో మానవ లోకం ఒక కీలుబొమ్మవంటిది. ఇదే నేను గ్రహించుకొన్న జీవిత తత్వం.

"మానవుడికి స్వతంత్రత లేదు. అతని బ్రతుకు బానిసబ్రతుకే"



మాచ్ ఖండ్ హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజక్టుయొక్క చిత్రకారుని యూహాచిత్రము. నిత్రమైన మాచ్ ఖండ్ నదీప్రవాహము విశేషంగా విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి వినియోగింపబడుతుంది.

# టైపిస్టు రాణి

శ్రీమతి సత్యవతి

ఆ అమ్మాయి పేరు రాణి ... పద్మారాణి. పేరు విని ఏ రాకుమార్తో, జమీందారిణో అని అనుకునేరు! వాస్తవానికి ఆ అమ్మాయి ఒక రిటైర్డ్ మునిసిపల్ క్లర్కు గారి ముద్దుకూతురు. స్కూల్ ఫైనలు చదువుతుండగనే కుటుంబంలో పెద్ద పెద్ద మార్పులు పెనుభూతాల్లాగ ఎదురైనయి. దాంతో రాణీ ఆశాసౌధాలపై పసిడిపూతలు రాలిపోయినై. అంతస్తులు విరిగి బోడి గోడలు మిగిలినయి - ఏనాడూ తలవనిదారులు తెరుచుకున్నయ్. వాటిగుండా తప్పటడుగులు వేస్తూ నడక ప్రారంభించింది.

జరిగిన పెద్ద మార్పుల్లో, తల్లి హఠాత్తుగా స్వర్గస్తురాలవటం, తండ్రి రిటైరవటం, తను చదువుకి స్వస్తి చెప్పటం రాణి భావి జీవితాన్ని పూర్తిగా దిగ తొక్కినియ్యి. వున్నత విద్యావంతురాలిని తప్ప పెళ్ళాడననే ఇంజనీరు మాఁవయ్య అదును చూసుకుని పైసంబంధం చేసుకున్నాడు. ఇక రాణీకి మిగిలింది తండ్రికి సుశ్రూష చేయుట యొక్కటే.

వచ్చిన ప్రోవిడెంట్ ఫన్డ్‌తో ఒక కొంప కొన్నారు. అందులోనే ఒక ప్రక్కవుంటూ మిగిలింది అద్దెకిచ్చారు. అదే ప్రస్తుత జీవనాధారం. రాణీ తండ్రికి సంతోషంగా సేవజేస్తూ గడుపుతూనేవుంది. కాని నానాటికీ రాణి ముఖంలో అలుముకుంటున్న అసంతృప్తిరేఖలు ఆ వేళ తండ్రీ కూతుళ్ళమధ్య చిన్న వివాదాన్ని లేవదీసినయి. పర్యవసానంగా రాణీ దిండులో తలదూర్చి ఏడుస్తుంది - "అమ్మవుంటే నా బ్రతుకు ఇలా తేలిపోయేదేనా!" అన్న భావం స్ఫురించిందా వెక్కి వెక్కి ఏడవడంలో. దానిని తండ్రి భరించలేకపోయేడు. దగ్గరకు వెళ్ళి బ్రతిమాలుతూ "అమ్మా! రాణీ - నామాటవిను ... మంచిదానవు గదూ! నువ్విలాగున ఏడిస్తే నేను బ్రతకగలనా! లే, నాముఖంచూచైనా లేఅమ్మా; కొడుకువైనా కూతురువైనా నువ్వే నన్ను సంతోషపెట్టేవు, నువ్వా ఇలా పట్టుపడితే ఎలా చెప్పమ్మా" అంటూ ఒడిలోకి తీసుకుని కళ్ళనీళ్ళు తుడిచేను.

"లేస్తాన్లేనాన్నా! - ఏమయిందిప్పుడు ..." అన్నాదేకాని తండ్రి మాటలకి కరిగి, లేవలేదు.

"ఇంకా ఏమవ్వాలమ్మా, వున్న ఒక్కదానివి అలా ప్రొద్దుట్నుంచి కన్నీళ్లు కార్చటంకన్నా ... నువ్వు శుభ్రమైన బట్టకట్టుకుని, నగ బెట్టుకుని సరదాగా తిరిగితే చూచి ఆనందించేకన్నా నాకు కావలసిందేఁవిటమ్మా! - కాని ఈ దౌర్భాగ్యుడు దానికి నోచుకోలేదు. విధి నిర్ణయం అలావుంది. ఇదే మగాడైతే నీ వయసొచ్చేప్పటికి స్వంత రెక్కలమీద నిలబడి స్వేచ్ఛ, సౌఖ్యం సంపాదించుకుంటాడు. ఆడదాని బ్రతుకు ఒకడిచేతిలో పడ్డాకనే సుఖపడుతుంది. అందుకనే కాస్త తిండి గుడ్డ అయినా ఇచ్చేవాడి చేతిలో పెడదామనే ఆశ, ప్రయత్నమూను, అంత వరకూ ఇలాగే తినో తినకో గడుపుకోవాలి. ...

"అది, ఆదినుండివచ్చే ఆచారం. స్త్రీకి సంఘంలో ఒక ఉన్నతమైన ఉత్కృష్టమైన స్థానం వున్నాది. దాన్ని, ఈ నాడు, చిన్న చిన్న ఐహిక సౌఖ్యాలకు, అర్థంలేని అహంకారాలకులోబడి కాలదన్నుకోవటం శ్రేయస్కరం కాదు. సంఘమే, స్త్రీకి, హంసతూలికాతల్పమౌతుంది. నిప్పుకణికను జడిచినట్టు జడుస్తుంది. అదే స్త్రీ నీతితప్పి నీతిమాలి ప్రవర్తించినప్పుడు, మరణశయ్యగా మారగలదు, బూడిదను వూదినట్టు వూదేయగలదు. ...

"ఏదో మీ క్లాస్‌మేటు ఎలీనా, ఆపరేటరుపని చేస్తున్నాదని, పక్కింటివారి రవణమ్మ, పంతులమ్మ పనిచేస్తుందని, సంపాదించుకొని సౌఖ్యపడుతున్నారని నువ్వూ ఉబలాటపడితే ఎలాచెప్పు. నువ్వు ప్యాసవగలిగింది, ఉద్యోగం చేయగలిగిందీ, నిజమే అయి

(1220 పేజీ చూడుడు)

శ్రవ్యనాటిక:

# ఆస్తికోసం

శ్రీ వి. కె. దాసరి



(విమల ప్రవేశిస్తుంది)

విమల:-అమ్మాయ్ జయా ...!

జయ:-ఆఁ...

వి:-బైట తలుపు వేసిరా...

జ:-ఎందుకే –

వి:-(గట్టిగా) నీక్కాదూ చెప్పేది - వేసిరమ్మంటే –

జ:-అబ్బ - చెప్పవే యెందుకో -

వి:-ముందు వేసిరా. మేడమీదనించి మీతాతయ్య బీరువా, గడియారం...కిందికి దింపాలి. బహుశా మీ పెద్దమ్మ వాళ్లు రావచ్చు – పో –

జ:-తాతయ్య సామాన్లెందుకే కిందికి తేవడం –

వి:-ష్. నోర్మూయ్!

జ:-సరే. (తలుపు వేసిన శబ్దం)

(విమల సామాన్లు సర్దుతున్న చప్పుడు)

వి:-జయా

జ:-ఆఁ... (వస్తుంది)

వి:-ముందు నువ్వు కట్టుకున్న ఆ పూలగౌనూ, పరికిణీ విప్పి పాతవి కట్టుకో – పో.

జ:-ఎందుకే –

వి:-తాతయ్య చచ్చిపోయాడుకదూ – అందుకని.

జ:-అందుకని –

వి:-ఔనే తల్లి! నీకు సమాధానం చెప్పటానికి ఆ బ్రహ్మదేవుడు దిగిరావాలి...

జ:-అయితే దిగివచ్చిందాకా ఆగుదాం, అయినా బ్రహ్మదేముడు యిప్పట్లో ఎక్కడొస్తాడులే.

వి.-ఏడిశావులే. వెధవ వేళాకోళం నువ్వూనూ. ముందు అవి విప్పి ఆ పాతగౌనూ, లంగా తొడుక్కురా పో...

(వీధి తలుపు తట్టిన శబ్దం)

వి: తొందరగా నువ్వు లోపలికిపో. నే తలుపుతీసి చూస్తాను.

(విమల తలుపు తియ్యడానికి పోతూ తిన్నగా జయతో విసురుగా ''లోపలికి పోవేమే'' అని నోరు నొక్కుకుంటుంది. తలుపు తీసిన శబ్దం – భర్త రామారావు లోనికి వచ్చిన చప్పుడు.)

వి:-మీరా నేను వాళ్లేమో అనుకున్నా.

రామా:-అబ్బే - నేనసలు రైలు స్టేషన్‌కే పోక పోతేను ...

వి: చూడండి. ఇందాకనుంచి దీనికి చెప్పటం – లక్ష్యంవుంటేనా! ఆ బట్టలు మార్చి పాతవి తొడుక్కుండవే అంటుంటే...

(అని వెళ్లి ఒక్క చరుపు చరుస్తుంది. కూతురు జయ లోనికి ఏడుస్తూ పోయిన శబ్దం)

రా:-(విసురుగా) ఎందుకే దాన్నలా చితక్కొడతావ్. చెప్పేదేదో తిన్నగా చెప్పరాదూ.

వి:-ఏం తిన్నగానండీ...అబ్బా కూతురూ ఒక్కటై.. ఇందాకణ్ణుంచి వాగిందాన్ని వాగినట్టుంటే! మీ గారాబం మరీ జాస్తయి పోయింది. గారా

బం గజ్జలుకడితే వీపు దెబ్బలకేడుస్తుంది — మరి!

రా:-చాల్చాల్లే వూరుకో. ఇంతకీ వాళ్లొస్తే ఏం చెప్పాలో ఆలోచించావా!

వి:-(తొందర తొందరగా) ముందు మేడమీదకి పదండి — మానాన్న గదిలోకి - ఆ బీరువాలు, బల్లలు కిందకి తేవాలి.

రా:-అవెందుకే యిప్పుడు......

వి:-వాళ్లొస్తే వాటాగీటా పంచాలంటారు. అందుకని కొంతసామాను ముందు చేరేసుకొని...

రా:-దాచిపెడ్దామంటావ్! తప్పగదే—అన్నీ సమంగా పంచుకుందురుగాని అప్పచెల్లెళ్లు —

వి:-మీకు తెలియదుండండీ...ఇలా రండి. చెప్తాను. కాస్త చేతి సాయం చేద్దురుగాని...

(అని మేడమెట్లు ఎక్కుతున్న చప్పుడు.- అప్పుడే కూతురు జయతో పెద్దగా —)

వి:-ఏమే జయా! నువ్వు ఆ కిటికీ దగ్గరుండి ఎవరైనా వస్తుంటారేమో చూస్తుండు. అప్పుడు నన్ను పిలువ్. నువ్వు మాత్రం తలుపు తీయొద్దు, జాగ్రత్త!

(మేడమీదికి పోయిన శబ్దం)

[లోపల రామారావు దంపతులిద్దరూ కలిసి ఒక డ్రాయరూ, బీరువా, గడియారం — యిత్యాదులు కిందికిదింపుకొని వస్తూన్న శబ్దం - కొంచెంసేపు గడుస్తుంది]

వి:-ఏమండోయ్! మీ పాతచ్చెప్పులు తీసి అవతల పడేయండి. ఇవిగో మా నాన్న కొత్తచెప్పులు తొడుక్కోండి. ఇదిగో — ఈ శాలువాగూడా తీసికోండి.

రా:-నాకొద్దు. మీ నాన్నకన్నా ముందు మీ అప్ప నన్ను దయ్యమై పట్టుకుంటుందేమో —

వి:-భలే ధైర్యస్తులండి! మా నాన్న మనకిచ్చాడని చెబుదాం. తొడుక్కోండి చెప్పులు -

(చెప్పులు తొడుక్కుంటున్న శబ్దం)

వి:-వాళ్లొస్తే మీరేం మాట్లాడొద్దు. నాటకమంతా నే ఆడిస్తాను.

రా:-సరే (అని కుర్చీలో కూర్చున్న శబ్దం)

(జయ బైటనించి కేక - "అమ్మా అమ్మా - ఎవరోవస్తున్నారే" అని. విమల త్వరత్వరగా సర్ది ఏడుపుగొంతుతో వీధి తలుపులు తీసిన శబ్దం. కమలా, రాజారావూ వచ్చిన చప్పుడు.)

వి:-అక్కయ్యా! (అని లబోదిబో మంటూ ఏడుస్తుంది)

కమల:-ఏంచేస్తామే అమ్మాయ్! (అని తనుగూడా ఏడుస్తుంది)

రాజారావు తిన్నగా దగ్గుతూ నడిచి వెళ్లి కుర్చీలో కూర్చున్న శబ్దం. విమలా, కమలా యిద్దరూ చెరోకుర్చీలో కూర్చున్న చప్పుడు)

క:-అయ్యో! ఏం రాత రాశాడే దేముడు! ఎలా పోయాడే నాన్న?

వి:-ఎలాఏముందీ.—మూడు రోజుల్నించీ ఒకటేజ్వరం కడుపులో నొప్పన్నాడు.

రాజా:-డాక్టరుకు కబురు చేయలా.

వి:-ఆఁ. చేశాం - డాక్టరు చిదానందం గార్ని

రా:-ఆయనా! (అని చప్పరిస్తాడు)

వి:-మొదట్నించీ ఆయనే డాక్టరు మనకు. సరే వచ్చాడా—ఏవోయింజక్షన్లు యిచ్చాడు. జ్వరం తగ్గకపోగా పైగా సంధి పుట్టింది.

క:-ఆయనవల్ల కాకపోతే యింకోడాక్టర్ని పిలవలా?

వి:-తప్పకదే అట్లా చేయటం! అంతా ఒకరిచేతి మీదుగా సాగాలి. రెండో ఆయన్ని తెస్తే యీ యనికి కోపంరాదూ_

క:-కోపం వస్తుందని మనిషిని చంపుకుంటారటే!

వి:-నీకేం చెపుతావ్. ఒకరు 'ట్రీట్' చేస్తుంటే రెండో డాక్టరు రానే రాడు.

క:-రాకేం-నాలుగు డబ్బులు పారేస్తేసరి(రామారావునుద్దేశించి) ఏమయ్యా మరిదీ! దానికి లేక పోతే నీకైనా వుండొద్దుటయ్యా...

రా:-అవును...అవును...

క: ఏం అవునయ్యా! ఎక్కడో 'వైశంపాయనుడికి జనమేజయుడు దొరికినట్టు...

రా:-ఏమోయ్! నువ్వేం మాట్లాడవ్.

రా:-మాట్లాట్టానికేముంది? అది చెపుతోంది చాలదూ...

క:-ఇద్దరూ కలిసి చేతులారా నిండుప్రాణాన్ని పొట్ట పెట్టుకున్నారు.

రా:-కాస్త ఓపిక పట్టు వదినా......

రా:-ఇంతకీ ఎట్లా చచ్చిపోయాడు -?

రా:-నేను మాట్లాడకుండానే మీ ఆవిడ పాఠం వప్ప జెప్తుందిగా......

రా:-కాదులే. (భార్యతో) నువ్వు కాస్సేపూరుకోవే. (విమలతో) నువ్వు చెప్పు విమలా...

వి:-నిన్న రాత్రి నాన్న ధోరణి మరీ ఎక్కువైతే డాక్టరు కోసం కబురు చేశాను. ఈ లోపల నేను వంటింట్లోకి పోయి పాలకి కుంపటి వెలిగించాను. జయ నిద్రపోయింది.........నాన్న గదిలోకి ఒకసారి పోయి చూద్దామని మేడమీదకిపోతే మంచం మీదలేదు. ఇల్లంతా వెదికాను. ఎక్కడాలేదు. దారిన పోయేవాళ్లనడిగాను. ఎవరో నదివేపు వెళ్తుంటే చూశామన్నారు...పరుగెత్తాను. అంతే-దూరాన ఏవో బుడగలు కనిపించినై. (అని ఏడుస్తుంది)

క:-ఇదేంచావే! అసలెక్కడికైనా వెళ్లాడో ఏమో. విచారించావా -

వి:-ఆయనకి ఎక్కడికీ వెళ్లే అలవాటులేదు.

రా:-బావుంది......

జయ:-(వస్తూ) భోజనాలైంతర్వాత మాట్లాడుకో వచ్చు పెద్దమ్మా...నాకాకలేస్తుంది _

వి:-వేస్తుంది-వేస్తుంది. తిన్ననోటికి తీపరం ఎక్కువ. ఇప్పుడా అన్నం! తాతయ్య చచ్చిపోయాడు...

జ:-అంటే ఏమిటమ్మా...

వి:-ముందుపోవే —

జ:-నా కాకలేస్తుందమ్మా.

వి:-పొమ్మంటే (అని లోపలికి తీసికెళ్ళి తిరిగి వచ్చిన శబ్దం.)

క:-చిన్నది తెలియకడిగితే దాన్నలా కోప్పడాలా!...
(బీరువావైపు చూసి వుండబట్టలేక)

క:-విమలా! ఇది నాన్న బీరువాకదూ-కిందకెందుకు దింపారూ. ...

వి:-పోయిన సంక్రాంతికి యిది నాన్న ఆయన కిచ్చారు ...

క:-అదేమిటే. నాన్న మా దగ్గరున్నప్పుడు మా ఆయన్ని తీసుకోమన్నారు. ... ఏమండీ! ...

రా:-నాకో నీకోగాని _ మొత్తానికి మనల్ని తీసుకోమన్నారు. ఈ అలమారగూడ చాలా బావుందే.

క:-అదా! అదీ మా నాన్నదేనండీ! (విమలతో) ఇదే పండక్కిచ్చాడమ్మా విమలా (అని ఎగతాళిగా అంటుంది.)

వి:-ఏపండక్కీ-కాదు-అలా చేతులు తిప్పుతూ అడక్కపోతే సరిగా అడగరాదూ ... చెబుతాను.

క:-చెప్పావులేమహా. అన్నీ బూటకపు మాటలూ నీవూనూ. ...

వి:-బూటకం చేయాల్సిన అగత్యం మాకేం పట్టింది! జయ వాళ్ల తాత దగ్గరకిపోయి "తాతా! ఆ అలమార నాకు కావా"లంది. "అలాగే తీసుకోమ్మా" అన్నాడు.

క:-అంటాడంటాడు —

వి:-అంటాడని తిన్నగ అంటావేంటి? పర్సనల్ గా ఆయనిస్తేనే తీసుకున్నాం. మిగతావి పంచేసుకుందాం పద–

రా:-నువ్వు కాస్సేపూరుకోరాదు వదినా! వచ్చిందగ్గర్నుంచీ...మీ నాన్న వచ్చాడోలేదో అప్పుడే పంపకాలు. ...

క:-చాల్చాల్లేవయ్యా భలే చెప్పొచ్చావ్. ఆ బుద్ధి నీ కళ్లానికి చెప్పుకో.

రా:-(మాట్లాడడు.)

రా:- నీకెందుకోయ్ మధ్య. అప్పా చెల్లెల్నిద్దర్నీ పోట్లాడుకోనియ్. ఎవరితొందర వారిది. మన కెందుకు - చేతయితే చెరోకట్టా సప్లయ్‌చేద్దాం.

క:-సామానంతా చూడాలి (మెట్లుఎక్కి తండ్రిగది లోకిపోయి వచ్చిన చప్పుడు.) ఇంకేముంది! ఖాళీచేసిపెట్టారు. పంచుకోడానికేముంది - బూడిదె.

వి:-ఆయనకి మేము చేసిన ఖర్చుకి సామాను తీసుకుంటే తప్పా ...!

క:-మేము మీకన్నా ఎక్కువే ఖర్చు చేశాం ...

వి:-వెండి బంగారాల్తో మేము ఆయన ఋణం తీర్చుకున్నాం. ...

క:-మాలో మీరు ఎన్నోవంతుచేశారు .. ఈ ఏణ్ణర్థం బట్టేగా మీ దగ్గరుంది. ...

వి:-నీ దగ్గరెన్నాళ్లున్నాడేంటి? అప్పుడు అమ్మేవుండేదిగా...! ఆయన మందుల కెంతయిందో తెల్సా?

క:-తిండికి మొహంవాస్తే జబ్బులొచ్చాయి కాబోలు-

వి:-కాదూమరి! నీవు పెట్టేతిండెక్కువై ...

క:-చాల్లే వూరుకుంటున్నకొద్దీ, నువ్వు చేసిన పనులు కనపడుతూనేవున్నై.

వి:-కాస్త ఆలోచించి మాట్లాడు —

క:-అంత తల తిక్కగా నేనేం మాట్లాట్టంలా. మీరే ... వచ్చేప్పటికి చేసే పనిచేసి ...

వి:-ఇక ఆట్టె వాగకు. మెడబెట్టి గెంటుతాను ఎవరింట్లో మాట్లాడుతున్నావో తెల్సా ...

(దగ్గుకుంటూ వృద్ధుని ప్రవేశం. తలుపు తెరచుకొని వచ్చిన శబ్దం.)

వృద్ధుడు:-(దగ్గ గంభీరంగా) ఆఁ ... తెలుసు.

జ:-అమ్మా! తాతయ్య వచ్చాడే.

వృ:-ఎందుకు అలా దెయ్యాన్ని చూసినట్టు చూస్తారు!

వి:-(రుద్ధకంఠంతో) నాన్నా! ఎక్కడికెళ్ళావ్ నాన్నా! జ్వరం తగ్గిపోయిందా? చెప్పు నాన్నా ...

వృ:-కాస్సేపు వూపిరి తీసుకోనియ్యమ్మా ... ష్ ... అబ్బా ... (రాజారావుతో) ఏమండీ రాజారావుగారూ! మీరెప్పుడొచ్చారు ...

రా:-ఆఁ యిందాకనేనండి ...

వృ: ఎందుకు అంతా విచారంగా వున్నారు?

క:-ఏంలేదు నాన్నా ...

వృ:-ఏం లేదంటారేం. నేవచ్చేప్పటికి యింట్లో ఏదో పోట్లాట జరుగుతూంటే. ఏం విమలా! మాట్లాడవ్.

వి:-(మాట్లాడదు.)

వృ:-ఈ బీరువా, గడియారం - పైనుంచి కిందికి దించారేం - నా గదిలోవి.

క:-నువ్వు అన్నీ తలొకటి కానుకలిచ్చావుటగా —

వృ:-(ఆశ్చర్యంగా) నేనా ! – నా కొత్త చెప్పులు రామారావు తొడుక్కున్నాడే —

రా:-క్షమించండి —

రా:-అంతేలెండి (నవ్వుతాడు)

క:-నాన్నా ! ఇక్కడ వీళ్లతో నువ్వు వేగలేవు గాని, మాతో రా, పోదాం.

వి:-అంతా నాటకం నాన్నా. ...

క:-నాటకం ! నాటకం నీది ! నాన్న చచ్చిపోయాడని టెలిగ్రాం యివ్వడం - మేము వచ్చేప్పటికి సామాను సర్దుకోడం-కనిపిస్తూనేవుందిగా-చెప్పటం ఎందుకూ.

వృ:-ఆఁ... ఏమిటీ! నేను చచ్చిపోయానని టెలిగ్రాం యిచ్చారా ... ఏమోయ్ రామారావ్! ... ఏం నాటకం ఆడారయ్యా ఆ స్తికోసం ...

వి:-నాన్నా ... (ఏడుస్తుంది.)

వృ:-ఛీ! నీ నాన్న ఎప్పుడో చచ్చిపోయాడు - కమలా ! ఇదిగో తాళంచెవి. ఆ బీరువాతీసి దానిలోవున్న విల్ నామా తీసుకురా. పో. నేను ముందే రాసివుంచాను. ఆ స్తీని రెండు భాగాలు చేసి ఒక భాగం - కమలకు - రెండో భాగం —

వి:-నాన్నా —

వృ:-జయకి - నాకు తెలుసు. విమలా రామారావుల పన్నాగం. నాకు సుస్తీగావుందనీ - ఎట్లాగూ బ్రతకడనీ-ఆ స్తికోసం జాగ్రత్తపడాలనీ ఏమేమో అనుకోడం - అందుకే యీ విల్లు ముందే రాసి వుంచాను.

(వృద్ధుడు పోతాడు)

వి:-నాన్నా ! (అని క్రిందపడుతుంది.)

[ఆల్ ఇండియా రేడియో ప్రసారితం]

# మహాత్ముని సూక్తులు



మానవుని చేతిలోవున్న మహత్తరశక్తి అహింస. మానవమేధాశక్తివల్ల కనిపెట్టబడిన విధ్వంసక ఆయుధాలన్నిటికంటే అహింస బలవత్తరమయినది. విధ్వంసన మానవధర్మంగాదు. అవసరమయితే సోదరమానవుని చేతిలో చావడానికి సిద్ధపడినప్పుడే మానవుడు నిజంగా, స్వేచ్ఛగా బ్రతుకకలుగుతాడు; చంపడానికి సిద్ధపడినప్పుడుగాదు!

♦ ♦ ♦

ఏదయినా పరిస్థితిలో భయపడి పారిపోవడమో, హింసకి పూనుకోవడమోతప్ప వేరే మార్గం లేనప్పుడు, తప్పకుండా హింసాప్రయోగమే నేను ఆమోదిస్తాను.

♦ ♦ ♦

అందరూ నడిచినదారినే నడవడం గొప్పగాదు. ఏది సక్రమమార్గమో తెలిసికొని, దాని వెనుక నడువటమే బుద్ధిమంతుని లక్షణం.

♦ ♦ ♦

నాలో తప్పుంటే ప్రతిఘటించండి. లేదా నన్ను అనుసరించండి!

♦ ♦ ♦

దైవభక్తిగలవానికి నరునిభీతిలేదు. నిర్మలమయిన హృదయంలోనే నిజమయిన సౌందర్యంవుంది.

♦ ♦ ♦

సర్వసంగ పరిత్యాగం, అస్ఖలిత బ్రహ్మచర్యం, ఇవి మహదాదర్శాలు. అవి నీకు చేతకాదనితోస్తే, తప్పకుండా పెళ్ళిచేసుకో! కాని నిగ్రహం అలవర్చుకో

♦ ♦ ♦

సత్యాన్వేషణంపట్ల నాకుగల భక్తి నన్ను రాజకీయాలలోకి తీసుకెళ్ళింది. ఒక్క విషయం నేను నిర్భయంగా, అతి నమ్రంగా చెప్పగలను. రాజకీయాలకి, మతానికి సంబంధంలేదని ఎవరయినా అంటే వాళ్ళకి మతం అంటే ఏమిటో తెలియదు.

♦ ♦ ♦

ఆధ్యాత్మిక సాధనలో జయంపొందడానికి మనసా, వాచా, కర్మా బ్రహ్మచర్య జీవితం గడపడం అవసరం.

సేకరణ: పిల్లా సుబ్బారావుశాస్త్రి

# వ్యాధి — చికిత్స

శ్రీ జి. వి. ఆర్. మూర్తి



ఏ దేశంలో ప్రజలంతా ఆరోగ్యవంతులై ఉంటారో ఆ దేశం సౌభాగ్యవంతమైనది. కనుక ప్రతివ్యక్తి తన దేశం సౌభాగ్యవంతమయ్యేటట్లు ప్రయత్నించాలి! అంటే ప్రతివ్యక్తి తన కర్తవ్యం గురించి తన శక్తికొలది దేశంలోని ప్రజలు ఆరోగ్య వంతులయ్యేటట్లు ప్రయత్నించాలి. అందులో ముఖ్యంగా స్త్రీలు.

మనదేశంలో చదువుకున్నవారు చాలా తక్కువ. అందువల్ల మూఢనమ్మకాలు ఎక్కువ. అంటు వ్యాధులు ప్రజల అజ్ఞానంవల్ల విజృంభిస్తే వారి గ్రామదేవతలకు కోపంవచ్చిందనుకుని, వారి కర్మ అనుకుని, వారి ప్రయత్నంవల్ల లాభం ఉండదనుకుని, దేవునికి చేతులు జోడించి దండంపెట్టి ఊరుకుంటారు.

అన్ని శాస్త్రాలకన్నా ఆరోగ్య శాస్త్రం ప్రజలకు ముఖ్యంగా తెలిసి ఉండాలి. ఈ శాస్త్రం గురించి ఎంతమంది వ్రాసి, ప్రజలలో ఎంత ప్రచారం చేసినాచాలదు. ఆరోగ్య సూత్రాలను తల్లులే బిడ్డలకు బోధపరచవలసిఉంది. తలిదండ్రులనే పిల్లలు అనుసరిస్తారు. కనుక ప్రతి స్త్రీ తన పిల్లలకు మార్గదర్శినిగా ఉండాలి.

వివిధ వైద్య విధానాలవల్ల వైద్యులు అనేక విధాలైన రోగాలను అరికట్టకలుగుతున్నారు. కొత్త కొత్త, వింత వింత మందులు ఎన్నో కనిపెట్టబడుతున్నాయి. ప్రజలంతా ఆరోగ్య సూత్రాలను పాటిస్తే మందుల అవసరం ఉండదు. పూర్వం మసూచి, కలరా మొదలైన వ్యాధులు పట్నాలను, పల్లెలను ఊడ్చుకుపోయేవి. కాని అవి యిప్పుడంత ఉధృతంగా లేకపోయినా యింకా అవి తలలెత్తుతున్నాయి. దీనికి కారణం ప్రజలకు ఆరోగ్య విజ్ఞానం లేకపోవడమే. ఈ వ్యాధులే కాకుండా టైఫాయిడ్, రక్తవిరోచనాలు, క్షయ, మలేరియా, బోదకాలు, మొదలైన అనేక వ్యాధులతో ప్రజలు చాలమంది బాధపడుతున్నారు. ఇటువంటి అంటు వ్యాధులను అరికట్టాలంటే ప్రజలలో ఆరోగ్య విజ్ఞానాభివృద్ధి కలగాలి. మీలో చాలామందికి తరుచు జలుబుచేస్తూ ఉంటుంది. చర్మవ్యాధులు కలుగుతూనే ఉంటాయి. ఉండవలసినంత ఆరోగ్యంగా మీరు ఉండడంలేదని మీకు తెలుసు. కనుక మీరు ఆరోగ్యంగా ఉండడానికి ప్రయత్నించాలి. ఆరోగ్యం చెడినప్పుడు మీ అంతట మీరు నిరపాయకరమగు పద్ధతిలో చికిత్సను పొందడానికి ఏంచేయాలో తెలుసుకోండి.

మనలో ప్రాణంఉంది. కాని ఆ ప్రాణం అంటే ఏమిటో ఎవరూ చెప్పలేరు. ఆ ప్రాణానికి ఒక శక్తిఉంది. దానిని ప్రాణశక్తి, చైతన్యశక్తి, లేక సజీవత్వము అని అంటారు. యింగ్లీషులో Vital Force అని అంటారు.

ఈ శక్తివలననే మన శరీరంలో ముఖ్యంగా రెండు పనులు నిత్యం జరుగుతూ ఉంటాయి. ఒకటి; మన శరీరంలో ఎప్పటికప్పుడు మరమ్మత్తులు జరుగుతూ ఉండడం; రెండు — శరీరంలోని మలినం ఎప్పటికప్పుడు బయటకు గెంటబడి పరిశుభ్రం కావడం. ఈ రెండు పనులు సక్రమంగా మన శరీరంలో జరుగకపోతే మన శరీరం వ్యాధిగ్రస్తమౌతుంది.

మనం నిర్వర్తించే పనిపాటలనుబట్టి మన శరీరంలో కొరతలు ఏర్పడతాయి. ఈ కొరతలను మరమ్మత్తు చేయడానికే ఆకలిద్వారా శరీరం ఆహారాన్ని

కోరుతుంది. మరమ్మత్తులకు తగిన పదార్థాలు ఆహారంలో ఉండాలి. ఆకలి సహజసిద్ధమైనది.

మన శరీరం మలమూత్రాదులను, చెమటను విసర్జించి పరిశుభ్రమౌతుంది. ఈ పని ప్రతిరోజూ జరుగుతుంది. ఒకొక్కప్పుడు కురుపులు, మొదలయిన చర్మవ్యాధులద్వారాకూడా శరీరం శుభ్రపడుతుంది. అతిసారం (విరోచనాలు) కలిగి పేగులు శుభ్రపడడంకూడ జరుగవచ్చును. చర్మవ్యాధులు, అతిసారం మొదలయిన వాటిద్వారా శరీరాన్ని శుభ్రంచేయడానికి ప్రాణశక్తి చేసే ప్రయత్నంలో శరీరంలో ఉష్ణం ఎక్కువయి జ్వరం కలుగవచ్చును. యధాస్థితిలో శరీరం ఉండకుండా యిటువంటి మార్పులు కలిగితే వ్యాధి అంటారు. ఈ వ్యాధులు తాత్కాలికంగాఉండి నయమౌతూ ఉంటాయి. శరీరంలో ఉండే ప్రాణశక్తే ఆ వ్యాధుల్ని నయం చేస్తుంది. చైతన్యశక్తి సన్నగిల్లినప్పుడు, సరైన చికిత్స అవసరం. సరైన చికిత్స జరుగకపోతే తరుణ వ్యాధులే దీర్ఘవ్యాధులుగా పరిణమిస్తాయి.

శరీరానికి తరుణవ్యాధి కలిగినప్పుడు చైతన్యశక్తి చాలా ఉషారుగా పనిచేసి, వ్యాధికి కారణమైన మాలిన్యాన్ని వీలయినంతవరకు హరించడానికి, వీలు కానిదాన్ని శరీరంలోనుంచి బైటకు గెంటడానికి విశ్వప్రయత్నంచేసి వ్యాధిని ఎదుర్కొంటుంది. ఆ రెండిటికి జరిగే సంఘటన మనకు సులభంగా తెలుస్తుంది. అటువంటప్పుడు ఆ ప్రాణశక్తికి మనం సహాయంచేయవలసి ఉంటుంది.

వ్యాధికి కారణం తెలుస్తే చికిత్స సులభమౌతుంది. చికిత్సకు ఔషధమే ముఖ్యంకాదు. చెడుతలంపులు, అధికశ్రమ, దురభ్యాసాలు, మలమూత్రాదులు సక్రమంగా జారీకాకపోవడం, సకాలంలో నిద్రాహారాలు లేకపోవడం, మొదలయినవి వ్యాధికి కారణాలు. వీటిని సరిదిద్దుకుంటే అదే చికిత్స, మిగిలినపని శరీరంలోని చైతన్యశక్తి చేస్తుంది. అవసరమైతే ఆహారం మానివేయడం, ఎక్కువగా మంచినీళ్లు త్రాగడం, మంచిగాలి వచ్చేచోట నివసించడం, మొదలయినవి చేయవలసి ఉంటుంది. ఒక్కొక్కప్పుడు కాపడం, ఒత్తడం, ఉపసమనంకోసం హానికరం కానటువంటి మందు దినుసులు లోనికి పుచ్చుకోడం మొదలయినవి కూడా చేయవలసి ఉంటుంది. ఇటువంటి సమయంలో విశ్రాంతి చాలా అవసరం. ఇవన్నీ వ్యాధిని ఎదుర్కొంటున్న చైతన్యశక్తికి సహాయపడతాయి. వ్యాధినిబట్టి యీ ఉపసమన చికిత్స మారుతుంది.

వ్యాధిని అణచిపెట్టే చికిత్స ఎప్పుడూ చేయకూడదు. ఆ వ్యాధి శరీరంలోని ఏ లోపంవల్ల కలిగిందో తెలుసుకుని ఆ లోపం కలగకుండా, చికిత్స చేయాలి; లేక ఆ లోపాన్ని భర్తీచేయాలి. చర్మవ్యాధులను పోగొట్టడానికని పైన మందులుపూస్తే, అది యింకో రూపంలో విజృంభిస్తుంది. విషక్రిముల వల్ల కలిగే వ్యాధులకుకూడా, ఆ విషక్రిములను చంపడానికని వేరే విషాన్ని వాడితే ఆ విషం మన శరీరాల కూడా హానిచేస్తుంది. విషక్రిములు మన శరీరాన్ని ముట్టడించాయంటే మన శరీరంలో ఏదో లోపం ఉందన్నమాట. ఆ లోపాన్ని సరిదిద్దితే, చైతన్యశక్తే ఆ వ్యాధిని ఎదుర్కొని జయిస్తుంది. శరీరంలోని ప్రతిభాగము, ప్రతి అంగము దాని పనిని అది సక్రమంగాచేయాలి. ఏమాత్రం దానిపని కుంటుపడినా అది వ్యాధి. కనుక ప్రతి అంగము దాని పనిని అది సరిగా చేసేటట్టు చేయగలిగినది మాత్రమే చికిత్స.

ప్రస్తుతం మనదేశంలో అనేక వైద్య విధానాలు వాడుకలో ఉన్నాయి. అన్నిటిలో పురాతనమైన 'ఆయుర్వేదం,' దానిలోనిశాఖ 'సిద్ధ,' మహమ్మదీయుల 'యునాని,' పాశ్చాత్య దేశాల్లోపుట్టిన ఎలోపతి, హోమియోపతి, బైయో కెమిస్ట్రీ యివన్నీ మనదేశంలో వాడుకలో ఉన్నాయి.

వ్యాధిగ్రస్తుని శరీరమేకాకుండా, మనసుకూడా మారుతుంది. ఒకే వ్యాధితో బాధపడుతున్న యిద్దరు వ్యక్తులు ఒకే విధంగా బాధపడరు. వ్యక్తికి, వ్యక్తికి రూపురేఖలలో భేదమున్నట్టే ఒకేవ్యాధికలిగిన వారి బాధలలో వ్యత్యాసము ఉంటుంది.

వ్యాధినిబట్టి అన్ని వైద్య విధానాల్లోను చికిత్స జరుగుతుంది. కనుక ఏవ్యాధో పేరు తెలుసుకుని చికిత్స చేస్తారు. ఒక్క హోమియో వైద్యంలో మాత్రం వ్యాధితో నిమిత్తంలేకుండా, అనుభవించే బాధను అనుసరించే చికిత్స జరుగుతుంది.

ఈ హోమియో వైద్య విధానమును డాక్టర్ శామ్యుల్ హానీమన్ కనిపెట్టాడు. ఇతడు జర్మనీ దేశంలో 1755 సంవత్సరంలో జన్మించాడు. ఇతడు చాలా బీదకుటుంబంలో జన్మించడంవలన, స్వయంశక్తి వల్లనే, కష్టపడి వైద్యపరీక్షలో ఉత్తీర్ణుడైనాడు. ఆ కాలంలో యీతడు మంచి శస్త్రవైద్యుడన్న పేరు గడించాడు. అనేక శాస్త్రాలలో దిట్ట.

హానీమన్‌కు తాను నేర్చుకున్న ఎల్లోపతి వైద్య విధానం తృప్తికలిగించలేదు. తన అసాధారణమైన వైద్య జ్ఞానంతో రోగులకు మందులిచ్చేవాడు; వ్యాధి నయమైనా రోగి మునపటికంటే చాలా నీరసపడడం చూచేవాడు. తను నేర్చుకున్న ఎల్లోపతి వైద్య విధానంవలన రోగికి మేలుకన్నా ఎక్కువగా కీడు కలుగుతున్నట్టు తెలుసుకుని భయపడ్డాడు. రోజు రోజుకు యీ అభిప్రాయం అతనిలో దృఢపడింది.

తను నేర్చుకున్న వైద్య విధానానికి మూలసూత్రం ఏమిటో తెలుసుకుందుకు ప్రయత్నించాడు. ఆ సూత్రం చాల సూక్ష్మమైనది. ఒక మందును కని పెట్టిన వైద్యుడు చాలా మంది రోగులకు ఆ మందును యిచ్చి, ఆ మందువల్ల రోగులకు స్వస్థతకలుగుతే, ఆ రోగాలకు ఆ మందు అమోఘమైనదిగా నిర్ణయించ బడుతూ ఉండేవి. ఇంతలో యింకొక వైద్యుడు, వేరొక మందును సూచించి అదే అమోఘమైనదంటే పాతదిపోయి యీ కొత్తదివచ్చేది. అంతవరకు శ్రేష్ఠమైనదన్న మందు పనికిరానిదయ్యేది. ఈ పద్ధతినే యిప్పటికికూడా మందులను ఎల్లోపతీ విధానంలో కనిపెడుతున్నారు. కాని మొదటనే రోగులమీద వాటిని ప్రయోగించకుండా, ఎలుకలు, పందులు, కుక్కలు మొదలయిన వాటిమీద ప్రయోగించి తర్వాత రోగులమీద వాటిని ప్రయోగిస్తున్నారు. తాత్కాలికంగా ఆ మందు రోగాన్ని కుదిర్చినట్టు కన్పడినా తర్వాత ఆ మందువల్ల శరీరంలో యితర బాధలు అనేకం కలుగుతాయి. వాటికి మళ్లీ మందులు.

ఈ విధానం హానీమన్‌కు నచ్చలేదు. రోగులమీద మందులను ప్రయోగించి వాటి ఫలితం తెలుసుకునే కన్నా, ఆ మందులను ఆరోగ్యవంతులమీద ప్రయోగించి వాటి ఫలితం ఎందుకు తెలుసుకోకూడదనే ఆలోచన ఆయనలోకలిగింది. ఆ ప్రయోగాలవల్ల కలిగిన అనుభవంతో చికిత్సా విధానంలో మార్పు తీసుకురావచ్చునన్న ఆశకూడా కలిగింది.

అతడు చాలా ఆరోగ్యవంతుడు. కనుక తన మీదనే ప్రయోగించి చూసుకోవాలనుకున్నాడు. మలేరియా జ్వరానికి ఆరోజుల్లోకూడ క్వయినా మందు కనుక మొదట ఆ మందు తనమీద ప్రయోగించుకుంటే ఏమార్పులు కలుగుతాయో మొదట తెలుసుకోవాలని, పెద్ద మోతాదులలో క్వయినాను తీసుకున్నాడు. అన్ని విషయాలలోను, మలేరియాను పోలినటువంటి లక్షణములు అతనిలో కలిగాయి. ఆ ప్రయోగాన్ని ఆరోగ్యవంతులైన తనస్నేహితులమీద, అనుచరులమీదకూడ చేసిచూశాడు. అందరిలోను మలేరియానుపోలిన లక్షణములు కనపడ్డాయి. మలేరియానుకుదిర్చే క్వయినావల్ల మలేరియావంటి లక్షణములు కలుగుతాయన్న నిశ్చతాభిప్రాయానికివచ్చాడు. ఇదే అతడు కనిపెట్టిన హోమియో వైద్య విధానానికి ప్రాతిపదిక. దీని ఆధారంతో సుమారు 100 ఔషధములను ముడిరూపములో తన మీద ప్రయోగించుకొని చూసుకొని హోమియో వైద్య సిద్ధాంతమును నిర్ణయించాడు. ఆ సిద్ధాంత సూత్రం యిది. “ఏ ఔషధము ఏవింత లక్షణములను ఆరోగ్యవంతమైన శరీరంలో తేగలదో ఆ మందే అటువంటి రోగచిహ్నములుగల రోగమును, చిన్న మోతాదులలో కుదర్చ గలదు.” దీనినే సారూప్య సిద్ధాంతం అంటారు. దీనినే యింగ్లీషులో “లా ఆఫ్ సిమిలార్స్” అంటారు. హోమియో వైద్యుల స్లోగన్ “సిమిలియా సిమిలిబస్ క్యూరంటర్.”

మడి ఔషధములను ఆరోగ్యవంతులకిచ్చి వారిలో కలిగే లక్షణములను హనిమన్ వ్రాసుకునేవాడు. దానికే 'ఔషధ నిరూపణ' అని పేరుపెట్టాడు.

ఒక ఔషధమును వివిధ మానవుల మీద ప్రయోగించినప్పుడు కొన్ని లక్షణములు అందరిలోను ఒకే మాదిరిగా ఉండేవి. వీటిని 'సాధారణ లక్షణములు' అనిన్నీ, వివిధ వ్యక్తులలో కలిగే వివిధ లక్షణములను 'ప్రత్యేక లక్షణము'లని పేర్కొన్నాడు. వీటినన్నిటిని ఒక పద్ధతిలో వ్రాసి పెట్టాడు. ఈ పద్ధతిని అనుసరించే అతని తర్వాత అతని అనుచరులుకూడా అవలంబించారు. ఈ విధంగా 'ఔషధ నిరూపణలు' చేశారు. ఇవన్నీ కలసి 'వస్తుగుణ దీపిక' యింగ్లీషులో 'మెటీరియా మెడిక' అయింది.

వస్తుగుణ దీపికలో మనకు ప్రతి ఔషధముయొక్క ప్రత్యేక లక్షణములు తెలుస్తాయి. ప్రతి ఔషధనిరూపణలోను అతి సూక్ష్మమైన దానినిగురించి వివరించబడి ఉంటుంది. రోగలక్షణములను పరీక్షించి ఆ రోగలక్షణములకు సరిగా ఏ ఔషధముయొక్క నిరూపణ సరిపోతుందో ఆ రోగమును ఆ ఔషధము తప్పక నివారిస్తుంది. తరుణ వ్యాధి అయినా, దీర్ఘ వ్యాధి అయినా ఔషధమును నిర్ణయించడంలో యిదే పద్ధతి.

రోగి తన బాధను చెప్పగలిగిన రోగలక్షణములు కొన్ని ఉంటాయి; వైద్యుడు పరీక్షచేసి తెలుసుకోగలిగినవి కొన్ని ఉంటాయి. ఈ రెండు విధములైన లక్షణములను గుర్తించి ఆ లక్షణములకు సరైన మందును వాడవలసి ఉంటుంది. దీనినే యింగ్లీషులో 'టోటాలిటీ' అంటారు. దీనిని గమనించి మందువాడవలెను. కొంతమందిలో రోగలక్షణములు ద్వంద్వముగా ఉంటాయి. అప్పుడు ఔషధము నిర్ణయించుటలో కొంచెం కష్టం కలుగుతుంది. వైద్యుడు అటువంటప్పుడు విచక్షణా జ్ఞానాన్ని ఉపయోగించి ఏ లక్షణములకు ప్రాముఖ్యత నివ్వవలసి ఉంటుందో నిశ్చయించాలి?

కొన్ని వ్యాధులలోను, ప్రమాదాలవల్ల ఎముకలు విరిగినప్పుడు శస్త్రచికిత్స అవసరం. అటువంటప్పుడు, హోమియో మందులవల్ల నయమౌతుందనుకోడం భ్రమ. కాని టాన్సిల్స్, పెద్ద పుండ్లు మొదలయిన వాటికి ఆపరేషన్ అనవసరం. హోమియో మందులవల్ల బాగా నయమవుతాయి. ప్రతి దానికి ఆపరేషన్ చేయడం ఒక్కొక్కప్పుడు ప్రమాదం కూడాను.

హనిమన్ సిద్ధాంతం ప్రకారం దీర్ఘవ్యాధులు మూడు రకాలు మాత్రమే. అవి సోరా, సిఫ్లిస్, సైకోసిస్. వీటినే 'మియాజిమ్స్' అంటారు. ప్రతి రోగం యీ మూడింటిలో ఏదో ఒక దానిలోకి వస్తుంది. ఈ మూడు విడివిడిగా రోగానికి కారణమవవచ్చును, లేక కలిసి ఉండవచ్చును. సోరా: మెదడునందు చెడుతలంపులకు స్థానము కలిగినవాడు చైతన్యశక్తి లోపిస్తుంది. ఆ లోపంవలన నరములు, మెదడు, చర్మము మొదలయిన వాటికి సంబంధించిన రోగచిహ్నములు గలది 'సోరా' కింద పరిగణించబడుతుంది.

సోరాతత్వంగల రోగి యీ క్రింది బాధలకు లోనవుతాడు. 1. చర్మవ్యాధులు 2. సుఖనిద్ర వుండదు. 3. మర్యాదను అతిక్రమించి కోపిష్ఠిగా మారతాడు. 4. తల వెంట్రుకలు ఊడిపోవడం, పండిపోవడం జరుగుతుంది. 5. తరచుగా మెటికలు విరుగుతూ ఉంటాయి. 6. శృంగార విషయములందు మనసు పరుగెడుతుంది 7. అకారణంగా జలుబు చేస్తుంది. 8. వివిధ రకాలయిన తలనొప్పులు, పార్శ్వ నొప్పులు కలుగుతాయి. 9. విరోచనబద్ధం, అతిసారం, లేక యీ రెండు ఒకదాని తర్వాత ఒకటి కలగడం జరుగుతుంది. 10. ముక్కులో పక్కులు ఎక్కువగా కట్టడం, వాటిని తీసేవరకు తోచక పోవడం జరుగుతుంది. 11. ఇట్టే అలసిపోవడం, వ్యాధులకు గురికావడం జరుగుతుంది. 12. స్త్రీలలో ఋతుబాధలు వివిధ రకాలుగా కలుగుతాయి. 13. చిన్నతనంలో ముక్కునుండి రక్తంకారడం ఉంటుంది. 14. చిన్నపిల్లలకు కడుపులో నులిపురుగులు, ఏలికపాములు చేరతాయి.

## సిఫ్లిస్

మియాజిమ్స్‌లో రెండవది సిఫ్లిస్. మనుష్య జాతిలో రోగస్థులైనవారిలో సగానికి పైగా యీ మియాజిమ్ కారణంగా బాధపడుతున్నారు. ఈ దోషము తగిలిన వెంటనే సరైన చికిత్స చేయించుకొనకుండా యింజక్షన్లు మొదలయినవాటితో అణచిపెట్టడంవలన రోగము శరీరంలో జీర్ణించి, మరింత ప్రమాదకరంగా రూపొందుతున్నది. శరీరాన్నిపీల్చి, పిప్పిచేస్తుంది. రోగి బాధలకు అంతు ఉండదు.

## సైకోసిస్

మియాజిమ్స్‌లో మూడవది యిది. ఇదికూడా సిఫ్లిస్ వంటిదే. ఇది పైకికనబడకుండా, మూత్ర ద్వారమును, మూత్రకోశమును ముట్టడిస్తుంది. సెగ, రస, దోషములవల్ల యీ దీర్ఘవ్యాధి మానవులకు కలుగుతున్నది. దీనినికూడ అణచిపెట్టకూడదు. సరైన చికిత్సచేయాలి. ఈ పైమూడింటి శాఖలే యితర వ్యాధులు.

## ఆర్గనాన్

హోమియోపతి వైద్యమును గురించి తెలుసుకో దలచినవారు, మొదట ఆ శాస్త్రమునకు వేదమువంటిదైన ఆర్గనాన్ చదవాలి. ఈ గ్రంథమును, యీ శాస్త్రమును కనిపెట్టిన డాక్టర్ హానీమాన్ మహాశయుడు రచించాడు. ఈ గ్రంథములో హోమియో వైద్య సిద్ధాంతమును గురించియు, దాని ముఖ్య సూత్రములు గురించియు విపులముగానున్నది.

ఈ వైద్య విధానం నిరపాయకరమైనది. ప్రతి గృహిణి యీ వైద్య విధానము చదివి తెలుసుకోవచ్చును. మన దేశంలో వైద్యం అందరి అందుబాటులోలేదు. కనుక యీ వైద్యమును ప్రతియింట పాదుకొలిపి, రోగ నివారణచేయుటకు అందరకు వీలున్నది. ఈ వైద్య విధానము ఎంత సులువైనదో అంత ఉత్కృష్టమైనది.



చాంబల్‌లోయ ప్రాజక్టు యొక్క చిత్రకారుని ఊహాచిత్రము.

# అరుంధతి పెళ్లి

డా॥ పాలూరి లక్ష్మీనారాయణ

సూర్యనారాయణ జిల్లాబోర్డు బడి పంతులు ఉద్యోగము చేసుకొనుచున్నాడు. అతనికి జీతము నెలకు రు 85 లు యిచ్చు చున్నారు. అతనికి ఒక గ్రామములో ఉద్యోగమువేసినారు. ఆయన కుటుంబ మన్ననో, భార్య కనకమ్మ, నలుగురు పిల్లలూ ఉన్నారు. పెద్దపిల్ల పేరు అరుం ధతి. మిగతా ముగ్గురూ మగపిల్లలు. ఆయనకు యీ కొద్ది జీతముతో కుటుంబ మును పోషించుకొనుట కష్టముగా ఉంటు న్నది. పిల్లలకు ప్రైవేట్లు చెప్పేవాడు. పాఠములు చెప్పించుకొనుటకు చాలమంది పిల్లలు వచ్చేవారుకాని అయ్యవారికి రుసుము చెల్లించేవారు బహు స్వల్పమే. చివరకు నెలకు రు 5 లు కంటే ఎక్కువ ప్రైవేట్లవల్ల వచ్చేదికాదు.

అరుంధతి చామనచాయలో అంద ముగా వుంటుంది. ఆమె ఆరవతరగతిలో చదువుకొనుచుండగా వ్యక్తురాలైనది. వెంటనే తల్లితండ్రులు ఆమెను బడికి పంపుట మానినారు. బడిమానిన పిమ్మట ఒక ఏడాది గడిచింది. కనకమ్మ పెనిమి టిని 'ఏమండీ! అమ్మాయి పెండ్లివిషయమై ఏమి ఆలోచించార'ని తొందర చెయ్యడం ప్రారంభించింది. సూర్యనారాయణ పిల్లకు సంబంధములు చూడడం ప్రారంభించాడు. ఏసంబంధముచూచినా తనకు కొంచెము నచ్చినదైతే కట్నము అడగడము ప్రారం భించారు. తాను కుమార్తె పెండ్లికై ఎట్లోకష్టపడి నిలువచేయకలిగిన రు 500 లు కట్నముక్రింద యిస్తాడా? లేక పెండ్లి ఖర్చులక్రింద వుపయోగిస్తాడా? ఏమి చేయుటకు పాలుపోక అట్లే రోజులు జరుపు చున్నాడు. రోజులు గడచినకొద్దీ అమ్మ గారు తొందర చెయ్యడం అధికమయింది. ఇట్లే రెండేళ్లు గడచినవి.

చివరకు సూర్యనారాయణకు నచ్చిన సంబంధము ఒకటి కనిపించింది. అంటే అదేమీ గొప్ప సంబంధముకాదు. ఇరగ వరం గ్రామంలో సీతారామయ్యగారని ఒకరున్నారు. వారికి ఒక చిన్న పెంకు టిల్లువున్నది. అయిదు ఎకరములు సొంత పొలమువున్నది. దానిని ఆయన స్వంత వ్యవసాయముచేసుకొనుచున్నాడు. ఆయ నకు సంతానము ఒక్క కుమారుడు మాత్రమే. అతనిపేరు పురుషోత్తమరావు. పురుషోత్తమరావు పుష్టిగా ఆరోగ్యముగా వుంటాడు. అతను స్కూలుఫైనలు పరీ

త్తుకు వెళ్ళినాడు. కాని యింగ్లీషులో మూడు మార్కులు తక్కువ వచ్చుటచే ఫేలయినాడు. ఉద్యోగము ఏదైనా దొరకుతుందేమోనని చాలా ప్రయత్నములుచేసినాడు. కాని అతనికి నచ్చిన పని ఏదీ దొరకలేదు. కావున యింటి వద్ద తండ్రికి వ్యవసాయములో సహాయము చేయుచూ ఉండిపోయినాడు. అతను చదువుమాని నాలుగేండ్లయింది.

సూర్యనారాయణ కుమార్తెకు యీ సంబంధము చేయవలెనని సంప్రదింపులు ప్రారంభించాడు. మగపెండ్లివారి పెండ్లి ఖర్చులక్రింద అయితేనేమి, వియ్యపురాలు లాంచనముక్రింద అయితేనేమి రు 1116 లు కట్నము యిస్తేనేగాని చేసుకోమన్నారు. సూర్యనారాయణ వద్దవున్న పైకము రు 500 లేగా- ఎట్లాగా అని ఆలోచించడం ప్రారంభించాడు. అతని భార్యకు అత్తవారు పెండ్లినాడుపెట్టినవి రు 1000 లు విలువగల నగలు వున్నాయి. భార్య కనకమ్మను ఆ నగలు అల్లుడి కట్నముకొరకు యిమ్మని అడిగినాడు. కనకమ్మ 'అదేమిటండీ, నగలు పెళ్ళిఖర్చుక్రిందయిచ్చి నన్ను బ్రతికివున్నన్నాళ్లు మెళ్లో పసుపుకొమ్ము కట్టుకొని వుండమంటారా? మళ్లీ మీరేమైనా ముక్కుపుడకైనా చేయించకలుగుతారా? అయినా ఇంట్లో చాకిరీచెయ్యడం ఆడదానిడ్యూటీగాని యింటి ఖర్చులు భరించడం ఆమె డ్యూటీకాద'నిదబాయించింది. నగలు యిచ్చుటకు ససేమిరా ఒప్పుకోలేదు.

పాపము సూర్యనారాయణ ఏం చేస్తాడు! ఒక షాహుకారును వెయ్యి రూపాయలు అప్పు యిమ్మని అడిగినాడు. ఆ షాహుకారు సూర్యనారాయణ మర్యాదస్థుడనిన్నీ, ఎట్లాగైనా ఋణము తీరుస్తాడనినమ్మి రు 1000 లు అప్పు యిచ్చాడు. పిల్లను పెండ్లికొడుకుకు చూపడం మొదలైన తంతులు అన్నీ జరిగిన తర్వాత పెండ్లి స్థిరపడింది. ముహూర్తం ఏర్పాటైంది. వైశాఖమాసములో పెండ్లి జరిగింది. పెండ్లి పూర్తయ్యేసరికి రాత్రి ఒంటిగంట అయింది. కనకమ్మ ఆ రోజు పనులతో అలసిపోయింది. రాత్రి చాలా ఉక్కగావుంది. కనకమ్మ తన నగలుతీసి పెట్టెలో పెట్టుకొని పెట్టెకు తాళమువేసి తాళముచెవిని మెడలో కట్టుకొని నిద్రపోయింది. తెల్లవారేముందు ఒకరొకరే నిద్రనుంచిలేవడం ప్రారంభించారు. ఇంటి తలుపులు భార్లాగా తీసివున్నాయి. ఇదేమిటని కంగారుపడి మాట్లాడుకుంటూంటే కనకమ్మకు మెళుకువ వచ్చింది. తలుపులు తీసివుండుటచే దొంగలుపడ్డారేమోనని అందరూ భయపడ్డారు. ఎవరి సరుకులకొరకు వారు చూచుకోవడం ప్రారంభించారు. కనకమ్మ పరుగెత్తుకొని తన పెట్టెదగ్గరకు వెళ్లింది. చూడగా పెట్టె



ఇండియా హోమ్ శాఖామంత్రి
శ్రీ గోవిందవల్లభ్ పంత్

తాళముతీసివేయబడి పెట్టెముందర పడి యున్నది. కనకమ్మ గుండె గుభిల్లుమన్నది. తొందర తొందరగా పెట్టెతెరచి చూచు కొంది. నగలులేవు. ఇంకేముంది. అమ్మో! నాయనో అని ఏడ్చింది. మళ్లీ పెండ్లిలో ఏడ్వడము వాగాయిత్యముగా వుంటుం దేమోనని ఏడ్పు దిగమ్రింగింది. నగలు మాత్రము దొరకలేదు. ఎవరుతీసినది ఆరాఏమీ చిక్కలేదు.

పెండ్లిఅయి రెండేళ్ళయింది. సూర్య నారాయణ షాహుకారుకు ఋణము క్రింద ఏమీ జమ యీయలేకపోయినాడు. ఊరు కుంటే లాభములేదని షాహుకారు సూర్య నారాయణమీద కోర్టులో దావావేశాడు. కోర్టువారు ఋణముయొక్క అసలున్ను వడ్డీయున్నూ దావాఖర్చులున్ను తీరేవరకు సూర్యనారాయణకు ఆస్తిఏమీ లేకపోవు టచే అతనికి జిల్లాబోర్డునుంచి వచ్చేజీత ములో నెల 1-కి రు 25 లు చొప్పున షాహుకారు తనకు రావలసిన మొత్తము పూర్తిఅయ్యేవరకూ వసూలు చేసుకోవల సినదని తీర్పుయిచ్చినారు. అట్లే జరగడం ప్రారంభమయింది. ఇట్లు నాల్గేండ్లకు పైగా జరిగితేనేగాని ఋణవిముక్తికి దారి లేదు ఇదివరలోనే తన స్వల్పరాబడితో కుటుంబమును పోషించుకొనుటకు కష్టపడు చున్న సూర్యనారాయణకు యిప్పుడు కుటుంబపోషణ మరీకష్టమయింది. ఇంట్లో వారికిగూడా దరిద్రబాధ ఎక్కువయింది. కనకమ్మ 'నావస్తువులను అల్లుడికట్నము క్రిందయిచ్చివుంటే ఎంత బాగుండేది, భగవంతుడా'! అని విచారింపసాగింది. కాని ఏంలాభం!




## కాకరకాయ వంటకాలు

కాకరకాయలలో రెండురకములు పొట్టివి, పెద్దవి. కాకరకాయ చేదయినా రుచికరంగా కూర, పులుసు, పచ్చడిలాంటి అన్నసాధకాలను తయారు చేసికొనవచ్చును. కాకరకాయ విరోచనకారికూడాను.

## కాకరకాయ కూర (రకాలు)

పొట్టివైతే తొడిమెలు తుంచివేసి, పెద్దవయితే ముక్కలుగా తరిగి ఒకకళాయి గిన్నెలోవేసి ముక్కలు ఉడికి మెత్తబడడానికి కావలసినన్ని నీళ్లు పోసి పొయిమీద పెట్టాలి. ఉడుకు పట్టబోయేటప్పుడు ఉప్పు, పసుపు కొద్దిగా చింతపండు పులుసు వేసి ముక్కలు మెత్తబడి నీళ్లు యినుకగానే దించాలి. ఒక బాణట్లో పరిమితంగా నూనె పోసి, అందులో రెండుమూడు ఎండుమిరపకాయల తుంపులువేసి, ఆవాలు, జీలకర, మినపప్పుకూడ వేయాలి. అవి చిటపట మనునప్పుడు గొద్దిగా కరేపాకువేసి వెంబడే ఉడికించి యుంచుకొనిన కాకరకాయముక్కలను కాని, పొట్టి కాకరకాయలనుకాని వేసి నూనెలో బాగా మగ్గునట్లు వేయించాలి. కావలసినవారు కారంచల్లుకోవచ్చును. దించబోవునప్పుడు అందులో కొద్దిగా చక్కెర చల్లి బాగా కలియకలిపి రెండుమూడు నిముషాలు పొయిమీదనే యుంచి దించి భోజనానికి వాడుకోవచ్చును.

కాకరకాయలను సన్నంగా చక్రాలుగా తరిగి కాగుతున్న నూనెలో దేవి తీసి పెళ్లెములో పోసి వేడిమీదనే మెత్తగా నూరిన ఉప్పు కారంచల్లితే కరకరలాడుతూ, రుచిగానుంటుంది. దక్షిణాదిన పులుసు, చారు కలుపుకొని అప్పడాలు, వడియాలు లాగనే కాకరకాయను యీవిధంగా తరిగి వేయించినవానిని కూడ అనుబంధ ఆహారంగా నుపయోగిస్తారు.

కాకరకాయలను ఉడకబెట్టిగాని, లేదా నిప్పులో కాల్చికాని పొట్ట చీల్చి అందులో చిన్న ఉల్లిపాయ కారంకాని, ఎండు కొబ్బరి, శనగపప్పువేసి కొట్టిన కారంగాని కూరిమి కాయలకు నడుమ తడపలతో కాని, దారంతోకాని కట్టి నూనెలోనో, నేతిలోనే వేలిస్తే చాల రుచిగానుంటుంది. దీనినే కారపుకాయ అంటారు.

## పులుసు రకాలు

కాకరకాయ ముక్కలను పిండిమిరయంలో వేస్తారు. దక్షిణాది అవియల్ లో వేస్తారు.

కాకరకాయముక్కలు, పచ్చిశనగపప్పు చిక్కని చింతపిండు పులుసులోవేసి, అందులో పచ్చిమిరపకాయలు తరిగేసి, పసుపు మెంతిపొడి, ఉప్పు, చక్కెరలతో బాగా తెర్లుతున్నప్పుడు యింగువపాలను పోసి దించబోయేముందు కరివేపాకు, కొతిమేరాకు వేసి దించితే గుమగుమవాసనకొడ్తూ యుంటుంది. తిరుగపోత పోసి వాడుకోవచ్చును.

## కాకరకాయపచ్చడి

కాకరకాయలను సన్నని ముక్కలుగా తరిగి తెర్లుతున్న చిక్కని పులుసులో ఆ ముక్కలు, ఉప్పు, పసుపు, కారం, కొద్దిగాబెల్లంవేసి ముద్దయ్యేలాగ పొయిమీద నేయుంచి, తార్వాతదించి పోపుబెట్టి పచ్చడిగా వాడుకోవచ్చును.

తాడిగడప అనసూయాదేవి

కాకరకాయ పచ్చడికి కాకరకాయలు, పచ్చిమిరపకాయలు, పెద్దఉల్లిపాయలు, అన్నీ సన్నగా తరిగి యుంచుకోవాలి.

చింతపండు పులుసును సిద్ధంచేసి యుంచుకోవలెను. బాణలిలో పరిమితంగా నూనెపోసి, అందులో ఆవాలువేసి పొయిమీద చిటపటమనునప్పుడు కొద్దిగా కరేపాకు వేసి, దానివెంబడే కాకరవగైరా ముక్కలు వేసి, ఉప్పు, పసుపుకలిపి ముక్కలను వాడనిచ్చి చింతపండు పులుసు పోయవలెను. బాగా ఉడుకునప్పుడు బెల్లం, కావలిస్తే కారంచల్లి ముద్దగానయ్యేదాక పొయిమీదనుంచి భోజనానికి వాడుకోవచ్చును. ఇదే విధంగా బెండకాయ, వంకాయ, పెద్ద ఉల్లిపాయ, గొడుగుమిరపకాయ (పెద్దమిరపకాయలను) సయితం పచ్చడిగా చేసికోవచ్చును.

## వరుగులు

కాకరకాయలు బాగా ముదిరి పెద్దవయిన వానిని పెద్దపెద్ద ముక్కలుకా తరిగి కొద్దిగా పసుపు, పరిమితంగా పుల్లటిపెరుగు, ఉప్పు వానిని మిశ్రంచేసి యుంచుకొని మరునాడు ఉదయం ఎండబెట్టవలెను. అలాగ 5, 6 రోజులు ఎండిన తర్వాత భద్రపరచుకొని కావలసినప్పుడు కాగుతున్న నూనెలోదేవి వాడుకో వచ్చును. ఇదేమాదిరిగా గోరుచిక్కుడు, పందిరి చిక్కుడు, బెంగుళూరు చిక్కుడు, బెండ, వంకాయ మొదలైనవానిని వరుగులుగా నుపయోగించవచ్చు

యం. ఆర్. సీతమ్మ

## కాకరకాయ తొక్కుడు కూర

సవాశేరు (¼ వీశె) కాకరకాయలు చిన్నచిన్న ముక్కలుగా తరిగి రోట్లోవేసిదంచి, రసంపిండి, యాతొక్కును వేరేగా నుంచుకోవాలి. ఉల్లిపాయలు సవాశేరు ముక్కలు తరిగి రోట్లోవేసి కచ్చాపచ్చగా దంచి కాకరకాయతొక్కులో కలిపి యుంచుకోవలెను. తరువాత తగినన్ని యెండుమెరపకాయలు ఉప్పు మెత్తగాదంచి పెట్టుకోవాలి. మూకుడులో యెక్కువగా మంచినూనె వేసి మరిగించి అందులో కాకర ఉల్లిదంచి యుంచుకొన్న తొక్కుడు వేసి బాగా వేచవలెను. దింపేముందు, దంచియుంచుకొన్న కారము ఉప్పు వేగిన తొక్కులోవేసి కొంచెము సేపు కలిపి, దించవలెను. చేదులేకుండా అన్నంలో కూరలాగ తిన డానికి చాలరుచికరంగా వుంటుంది. రెండురోజులు వరకు వుంచుకొని వాడుకోవచ్చును. చెడిపోదు. సాధా రణంగా నైజాందేశంలో ఇదిఎక్కువగా చేస్తారు.

మద్దాలి సీతాలక్ష్మి

# బాబు

శ్రీ ఆకెళ్ళ జానకిరామ సుబ్రహ్మణ్యాం

[జానికమ్మ తన కుమారుని అష్టకష్టాలుపడి పెంచుతూంటుంది. ఆమె జీవితంలో బాబు పెరిగి పెద్దవాడై చదువు సంధ్యలు నేర్చుకొని అభివృద్ధిగాంచితే చూచి ఆనందించి సుఖపడాలనే ఆమె ఆశ. దాని కను గుణ్యంగా బాబు సయితం బుద్ధిమంతుడుగా చదువుకొంటూండేవాడు. ఒక రోజు రాత్రి పొద్దుపోయిందాక బాబు బడినుండి యింటికి తిరిగి రాలేదు. జానికమ్మ బాబు నడతను గురించి తర్కించుకుంటూ ఎదురు చూచిచూచి పడుకుంది. రాత్రి పదిగంటల తరువాత బాబు తిరిగి రాగానే అన్నము పెట్టి పండుకోమని చెప్పింది. బాబు భయపడుతూ పండుకోబోయే సమయాన జానకమ్మ పిలిచి 'ఎక్కడికెళ్లావింతవరదాక' అని గద్దించి అడిగింది. -- యిక చదువండి.]

(గతసంచిక తరువాయి)

"ఎక్కడికి వెళ్లిలేదే" అని అబద్ధం ఆడేడు భయంతో తన తప్పును కప్పిపుచ్చుకుందుకై. అలాగని చెప్పినంతమాత్రాన తన తల్లి ఇంక అడగదనుకున్నాడు పాపం బాబు.

జానికమ్మ గారు లేచింది. బాబుచెవిపట్టుకుని గట్టిగా మెలితిప్పుతూ "ఈసారిచెప్పు, ఎక్కడికి వెళ్లేవో" అతి నెమ్మదిగా, ఈ విషయం ప్రక్క యింటివాళ్ళకి ఏంతెలిసిపోతుందోననే భయంతో అడిగింది.

"చెవినొప్పేవ్... అమ్మోయ్, వదలవేవ్" ఏడవటం మొదలుపెట్టాడు గట్టిగా, అసలు విషయం చెప్పకుండా.

"నోర్ముయ్ రాగం పైకి రానిచ్చావా, నడ్డివాచి పోతుంది." ఏడవటానికి నోరు తెరచిన బాబునోరు అలాగే తెరచివుండి పోయింది.

"చెప్పు ఎక్కడికెళ్ళావో?.. త్వరగా చెప్పాలి" తిరిగి గట్టిగా మెలిపెట్టింది చెవిని.

"సి...నీ...మా...కు వెళ్ళేనే." వెక్కి, వెక్కి వస్తున్న ఏడుపును ఆపుకుంటూ సమాధానం యిచ్చాడు బాబు.

"ఎవరితోటి?... అసలు నీకుడబ్బులెక్కడివి?" అని అడుగుతూ, బాబు చెయ్యిపట్టుకుని, ప్రక్క గదిలోకి తీసుకుపోయింది, ఈగొడవంతా అందరూ వినిపోతారని. బాబు బెదురుచూపులు తప్పితే ... నోటంపటమాట పూడిపట్టంలేదు.

మూలలోవున్న వేపబెత్తంతీసింది ... బాబు విష యమై, ఈ బెత్తం ఇంతవరకు అవసరంరాలేదు. దాని అవసరం ఈ రోజున రావటంతో, చిత్తంవచ్చినట్టు విజృంభించింది. "ఎక్కడికెళ్ళేవు ... ఓ దెబ్బ; చెప్పు ... మరోదెబ్బ" ప్రశ్నకో దెబ్బచొప్పున టకటకా ప్రశ్నలతో అతని మనస్సును, దెబ్బలతో అతని శరీరాన్ని కదలించివేసింది జానికమ్మగారు.

"మా క్లాసు కుర్రాడు తీసుకువెళ్ళేడు ... డబ్బులు వాడేపెట్టుకున్నాడే. ఇంకెప్పుడూ వెళ్ళనే ... కొట్టకే. నేనెప్పుడూ వెళ్ళనే" దెబ్బలకు గజగజావణికిపోయాడు బాబు.

"మరి మొట్టమొదట అబద్ధం చెప్పేవేం ... ఇంకెప్పుడూ అబద్ధం ఆడకేం! ... ఏం! ఏం!" గబగబా - ఎక్కడ కొడుతోందో తెలియకుండా, వళ్లు హూనంచేసిపడేసింది.

"ఇంకెప్పుడూ అబద్ధంఆడనే...సినీమాకు వెళ్ళనే. నామాటనమ్మ ... జాగ్రత్తగా చదువుకుంటానే. ఈ సారి పొద్దుపోయివస్తే చంపేయవే ... కొట్టకే బాబూ, కొట్టకే" దెబ్బదెబ్బకు గిరగిరా తిరుగుతూ, ఆఖరికి తల్లికాళ్ళమీదపడ్డాడు.

"వెళ్ళువెధవా ... పడుకో" బెత్తం వాడి మొహానవిసరి, వీధిగదిలోకివచ్చిపడుకుంది జానికమ్మగారు.

"అమ్మా" అని మూలుగుతూ, ఎంతో బాధతో లేచేడు. లేచేటప్పుడు ప్రతీఅవయవం బాధపెట్టింది. దీపం పెద్దదిచేసి శరీరం అంతా చూసుకున్నాడు. కనీసం ప్రతి అంగుళానికి, ఓ వాత చొప్పున, దద్దుర్లతో శరీరం అంతా నిండిపోయింది. మోకాలి చిప్ప దగ్గర రక్తం కారుతోంది. రక్తాన్నిచూసి, పెల్లుబికి వస్తున్న ఏడుపును ఆపుకోలేకపోయాడు. "అమ్మా! ..." ఒక్కసారి గట్టిగా రాగంతీసి తిరిగి నోరు నొక్కేసుకున్నాడు. అమ్మ లేచిందంటే మళ్లీ శరీరం వాచిపోతుంది. ... ఏడుపును దిగమింగుకుంటూ, దెబ్బలకు అలిసిపోయినబాబు, నిద్రపోయాడు.

"అమ్మా" అంటూ నిద్రలో మూల్గుతున్నాడు బాబు. శరీరం అంతా వణికిపోతోంది.

గాఢనిద్రలోవున్న జానికమ్మగారికి ఆ పిలుపు వినపడేసరికి, మెలుకువవచ్చింది. ఆతృతతో 'ఏం నాయనా' అంటూ శరీరంమీద చెయ్యివేసింది. శరీరం కాలిపోతోంది.

"అబ్బా! నొప్పి" అంటూ రెండోవైపుకు వొత్తిగిల్లాడు. ఆ దీపకాంతిలో బాబు శరీరంమీద వాతలు, దద్దుర్లుగా తేలి, స్పష్టంగా కనపడుతున్నాయి జానికమ్మగార్కి.

"దెబ్బలు నొప్పి పుట్టవునాయనామరి! ... ఎప్పుడూ నేచెప్పినట్టుగా వింటుంటే దెబ్బలు తగలవు. నువ్వింత ఆలస్యంగా వచ్చినందుకు నా మనస్సెంత బాధపడిందో నీ పసిహృదయానికి ఏమితెలుసు? నేను బాధపడిన బాధలో, నువ్వు అనుభవిస్తున్న బాధ ఎన్నోవంతు? నువ్వు చెడుస్నేహాలుచేసి పాడైపోతుంటే, నాకు బాధకదూ! ఆశలన్నీ నీమీదపెట్టుకొని ... నువ్వే మన వంశానికి గౌరవప్రతిష్ఠలు తెస్తావని ఆశిస్తున్న నేను, నువ్వీ విధంగా చెడిపోతూవుంటే, చూస్తూ వూరుకోగలనా? ... అందుకనే పళ్లుతెలియని ఆవేశంలో, కొట్టేచోట కొట్టనిచోట తెలుసుకోకుండా నిన్ను కొట్టేను. ... పోనీ నువ్వే ఆలోచించుకో ... నీకు జ్ఞానంవచ్చిన తరువాత నిన్ను ఎప్పుడైనా ఈ విధంగా కొట్టేనా? నువ్వు ఎప్పుడైనా ఇటువంటి పాడుపనులుచేసి ఎరుగుదువా" అని ఇంకా ఏవేవో అంటూ, నూనెతెచ్చి, దెబ్బలికి రాసింది.

"అమ్మా! నేనెప్పుడూ అబద్ధంఆడనే ... ఎప్పుడూ సినీమాకు వెళ్ళనే. నామాటనమ్మ ... పాడుస్నేహాలుచెయ్యనే - చదువుకుంటానే...కొట్టకే, కొట్టకే..." అంటూ నిద్రలో పలవరిస్తున్నాడు బాబు.

"నిన్ను ఎప్పుడూ కొట్టనుబాబు. ... అనవసరంగా ఎందుకుకొడతాను" అంటూ బాబును తన హృదయానికి హత్తుకుని, తనివితీరా ముద్దుపెట్టుకుంది.

దాంతో బాబుకు మెలుకువవచ్చి, ఆశ్చర్యంతో తల్లికళ్ళలోకి చూస్తూ కూర్చుండిపోయాడు.

—o—

# అనుగు తల్లి

శ్రీ బి. యస్. రాజారెడ్డి

తెనుగుతల్లి యదిగో
అనుగుతల్లి యిదిగో।

గౌతమికృష్ణా పెన్నానదులతో
త్రికవులువ్రాసిన భారతకవితతో
వెలుగుచున్నది సహజప్రతిభతో
నడచుచున్నది నిండు గుండెతో॥

శిల్పాచార్యుడు నాగార్జునుల
శిల్పకల్పనా సౌందర్యాలతో
అలంకరించుకు ఆనందంతో
అందుకున్నది తల్లిదీవెనలు॥

తిరుపతికొండల విశాఖమండల
ఉన్నతమై యతివిశాలమై
ఎగయుచున్నది ఏకోన్ముఖముగ
కదలుచున్నది కార్యదీక్షతో॥

నాట్యకారులు నటశేఖరులు
చిత్రలేఖకులు జంత్రగాయకులు
బహుముఖ ప్రజ్ఞాశాలుర యెందరో
లలిత లలిత సుకుమార బిడ్డల
కన్నతల్లియదిగో – ఆంధ్రమాత
యిదిగో!

"గేయకథ"

# మాతృప్రేమ

శ్రీమతి మునిపల్లె సరస్వతి

దశపురియను పట్టణంబును,
ధర్మపరాయణుడను పేరుగాంచిన,
ధర్మసింహుఁడను దొడ్డప్రభువు,
ధర్మచక్రముగ నేలుచుండెను—

దశపురిపట్టణ పడమటిదిక్కున,
ధరణిధేనువను పల్లెగ్రామమున,
దీర్ఘకాయుఁడను జాలరివానికి,
దాసి, కాసి, నులను భార్యలుండిరి—

దీర్ఘకాయుఁడు దేహమునొదిలి,
దేవుని సన్నిధికే తెంచుటకై,
దాసి కాసినుల దగ్గరనున్న,
ద్రవ్యపుమూటను దెమ్మనిపల్కె—

ఇరువురు భార్యలు ద్రవ్యపుమూటను,
ఇరువురిచేతులమీద వేసికొని,
ఇహమును విడచుట కిష్టములేని,
ఇరువురు భర్తనుగాంచి దుఃఖించిరి—

దీర్ఘకాయుడా ద్రవ్యముజూచీ,
దీనురాలగు దాసితో బల్కెను—
"మీలో నెవ్వరు బిడ్డను గందురో ?
వారే ఎక్కువ ధనమును బొందుడి."

దాసికి నారవమాసమందునే,
జాలరివాడు చచ్చిపోయెను—
కాసికి మాత్రము కుక్కపట్టక
దాసిబిడ్డను జంపజూచెను—

దాసి, బిడ్డపోయెనని ఏడ్చుచు,
దశపురిరాజుకు విన్నవించెను,
దాసికాసినుల రప్పించెనురాజు,
బిడ్డనునరుకుట కానతియిచ్చె !

కన్నతల్లి మన దాసికడుపులో,
కత్తులు దూసినట్లయ్యె పాపము—
పెదవులు తడబడ దాసి రాజుతో—
"పాపను కాసికి యివ్వుమనియెను"

దశపురిరాజా దాసి ముఖంబును,
పరిపరివిధముల పరికించాడు,
దాసిబిడ్డను ద్రవ్యపుమూటను,
దాసిచేతికే యర్పించాఁడు.

కఠినురాలగు కాసిని రాజు,
క్రూరముగా శిక్షించాఁడు,
కన్న తల్లుల యనురాగంబు,
ఎన్నదరమె యీ యిలలోన—"

# స్త్రీలు - చిత్రకళ

కవిశేఖర శ్రీ విశ్వనాథ నరసింహము

(గతసంచిక తరువాయి)

సంస్కృత కవులలో నధిక ప్రశస్తి వహించిన భవభూతి తన విశిష్ట దృశ్యకావ్యమగు ఉత్తరరామచరితంబున చిత్రపట సందర్శనమును మొదటి యంకమున వర్ణించియున్నాడు. అనగా రామాయణ కాలములోగూడ చిత్రకారుల రాజచంద్రులు పోషించుచుండినట్లును, ఆ చిత్రపట సందర్శనంబున జానకీదేవి ఆమోదము చెంది ఆనందించినట్లును తెలియుచున్నది. శ్రీరాముని ఆదరామోదముల కొఱకు చిత్రకారుడు ఆతని గతజీవిత వృత్తాంతములనే బాల్యాదికములు, అరణ్యావాసము, పరశురామగర్వభంగము మున్నగునవియే చిత్రించినట్లు తెలియుచున్నది. ఈ నిదర్శనమువలన చిత్రలేఖన విద్య మన హిందూదేశములో నెంతటి ప్రాచీనకాలమునుండి అభ్యసింపబడుచుండెనో, రాజపోషణము నెట్లు పొందుచుండెనో తెలియుచున్నది.

సంపన్న గృహస్థుల స్త్రీలు దీపారాధన మొనరించు నలవాటు హిందూదేశమంతటను కాన్పించుచున్నది. దీనికి ప్రాతిపదిక సూర్యోపాసనము, సూర్య భగవానుడు ప్రత్యక్షదైవమని ఆతని నారాధించుట సంప్రదాయ సిద్ధముగా నున్నది. సూర్యోపాసనకు ఎఱ్ఱని గన్నేరు పూవులు తదితరములగు నారంగుగలవియును ముఖ్యములు. అక్షతలుకూడ కుంకుమ చందనముతో కిలిపి వానితో సూర్యారాధనముచేయుదురు. దీపావళి యనబడు నుత్సవము హిందూదేశమందెల్లెడల కానుపించును. ఉత్తర హిందూస్థానమునందు మఱింత ఉజ్జ్వలముగా నీ సందర్భమున స్త్రీలు సూర్యదేవతోపాసన జేయుదురు. ప్రతివారును గృహాంగణ ప్రదేశమును శుభ్రపఱచి సాయంసమయమున ప్రారంభింపబడిన దీపారాధనము కనుచీకటిపడుసరికి పూర్తి అగును. జోతులను పేరున పిండితోచేయబడిన చిన్న చిన్నవగు శివులమధ్య నొకవత్తినిడి అందు నేయికాని నూనెకాని పోసి దీపముల వెలిగింతురు. కొందరు ప్రమిదలలో దీపముల పెట్టుదురు. కొన్ని చిన్న చిన్న దీపముల సమూహముగా నలుచదరముగాకాని వలయాకారముగాకాని పెట్టిన తరువాత సరిగా వాని మధ్యమున నొక పెద్ద దీపమును పెట్టెదరు. అందు చమురున్నంతవరకాదీపములు వెలుగుచుండును.

కొందురు. పూలమాలల ధరించుట యందనేక విధములగు చిత్రరచనా కౌశలములు చెలువారుచుండును.

హైందవ సుందరీమణుల రచనా విశేషములు చిత్రరచనాదులయందు సహజశోభా విలసితములగునను విషయము వారి నిత్య కృత్యములందును గోచరించుచున్నది. అందు ముఖ్యముగా రంగవల్లుల రచించుట లోని రామణీయకత స్తుతి పాత్రము. బలి హరణమను పేరుతో పూర్వ సంప్రదాయమున ముంగిట కలయంపి జల్లిన సమయమున సమసిపోవునవి సూక్ష్మజంతువులనియు ఆ దురిత నివారణమునకొఱకు బియ్యపు పిండిని ముగ్గులుపెట్టి మఱి యితర సూక్ష్మ జీవుల కాహారము గల్పించవలెననియు వారి యాచారముగానున్నది.

గోమయమిళిత జలంబుల గృహాంగణముల శుభ్రపరచిన వెనుక ప్రాతఃకాలమునసే యీ ముగ్గులపెట్టుట సంప్రదాయము. ఇందు వివిధకాలములలో వివిధాచారములున్నవని తెలియవలెను.

కార్తికమాసము మొదలుగా నీ ముగ్గుల మురిపెము మిక్కిలి యెక్కువగా నుండును. నారీమణులు ముంగిటియందు జలక్షాళనాదులయిన తరువాత చిత్ర విచిత్రములుగా ముగ్గులు పెట్టుదురు. అందు వివిధ వృక్షాకారములు, జంతువుల యాకృతులు, గృహారామాది విలసనంబులు, పద్మాకారములును, తదితర రచనా విశేషములును అనేక విధముల నయనానందకరముగా నుండును.

అందు పద్మము లనేక విధములగు చిత్రరచనా సౌందర్యములతో నలరారుచుండును. అన్నింట నెన్నందగునది సహస్రదళ పద్మాకారము. ఇంక గృహములు, తదీయద్వారము, ద్వారద్వయ సమన్వితములు, ద్వారచతుష్టయము, ద్వాదశద్వార సౌధములన్నింటిలో నత్యంత రమణీయములని చెప్పనొప్పును.

జంతువులలో గజాకారము మిగుల సొగసుగానుండును. గృహద్వారంబుల నేన్గుల నిరుపార్శ్వంబుల గొందఱు చిత్రింతురు.

సంక్రాంతి ముగ్గులని పౌషమాసము నందలి మకర సంక్రమణమునకు నెలదినములు పూర్వముగా నీ రంగవల్లుల రామణీయక మారంభింపఁబడి క్రమక్రమముగా నభివృద్ధినొందుచు సంక్రాంతినాటికి సర్వవిధముల సంపూర్ణ సౌందర్యము నొందును.

తులసిపూజ నొనర్చుట మఱియొక హైందవాచారము. మాఘమాసమునందు సూర్యార్చన మనేక విధములుగా జరుగుచుండును. అందు తులసికోటవద్ద ముగ్గులుబెట్టి అలంకరించుట ఆచారము. అందు వివిధ పద్మాకారములు రంగురంగు

లతో విలసిల్లుచుండును. ఇందు భక్తి శ్రద్ధలు కాన్పించుటయు చిత్రరచనా కౌశలము చెన్నువహించుటయు నేకకాలమున మనము చూడగల్గుదుము.

కేవల హస్తమాత్ర సాహాయ్యంబున ఊహాశక్తి ననుసరించి చిత్రవిచిత్రంబులగు రచనా విధానములఁ జూపి నిత్యకృత్యముగా చిత్రరచనా విన్యాసములు చూపు సంప్రదాయము, భగవద్భక్తి పూరితముగా నర్చించునాచారము హైందవ సుందరీమణులలోనే, కాన్పించును కాని ఇతర పాశ్చాత్యదేశములం దెచ్చటను మృగ్యనకైన కానరాదు.

ఆసేతు శీతాచల పర్యంతమును గణాధ్యక్షునర్చించుట హైందవ సంప్రదాయముగానున్నది. గణపతి పూజకై తద్దేవతాకార నిర్మాణము అవశ్యమగుచు తదీయ మృత్తికాది రూపముల నిర్మాణము హైందవ స్త్రీలు చేయు శిల్పరచనా విన్యాసముగా నెంచదగును. ప్రాచీన కాలమునందును ఆ గణపతి దేవుని శిలా నిర్మాణములు ఉపదేవతగు నా దేవునర్చించుటలును మనకీ వఱకు తెలిసిన విషయములు.

గణపతి నవరాత్రములను పేర యుత్సవములు మన దేశములో జరుగుచుండును. ఆ యుత్సవదినములలో గణపతి మృత్తికా నిర్మాణము సామాన్యులందఱు చేసి అర్చింతురు. లోహనిర్మాణములును, వెండి బంగారు విగ్రహములును కూడ నా వినాయకునకు చేయించి బహువిధముల నర్చించుట ఆచారము. పురాణములలో వివరింపబడిన రీతిగానే గణపతి శిల్పరచన గజముఖాదులతో నిర్మింపంబడుచున్నది.

ఇటులనే సరస్వతీ పూజాదికము లొనర్చు సందర్భములుకూడ సంప్రదాయముగానున్నవి. సరస్వతీ విగ్రహనిర్మాణము కూడ మృత్తికాదులతో నిర్మించి వివిధాలంకారములతో వీణాది వాయిద్య విశేషములతో నిర్మించి యర్చించుటాచారము. ఆ దేవతామూర్తికి నాల్గు చేతులున్నట్లు కొందఱు చిత్రకారులు రచించియున్నారు. ముఖ్యముగా నాదేవత సంగీత సాహిత్యాది సమస్త విద్యలకు నధిదేవతగా పరిగణింపంబడి వివిధ శిల్పనిర్మాణములతో చిత్రరచనా విన్యాపములతో నిర్మింపంబడి హైందవులచే నారాధింపబడుచున్నది.

మఱియు దిష్టిబొమ్మలను పేర శిల్పకళా విశేషమొండు కాననగును. ముఖ్యముగా మట్టిబొమ్మలు పంటచేలకు చూపరుల దృష్టిదోషముకలుగకుండ నిర్మింతురు. అట్టి విధానములనేకములున్నవి. అందు ముఖ్యముగా స్త్రీలు రచనా కౌశలము చూపుచుందురని మనకు తెలియుచున్నది.

ధూర్జటి మహాకవి కాళహస్తి మాహాత్మ్యమున భిల్లాంగనల శిల్పరచనవేళ బొమ్మల నిర్మించుటలో నీరీతి వర్ణించి యున్నాడు.

అగురుత్మోరుహ కాష్ఠఖండముల సర్వాంగంబులను చేసి శరీరమునకు మృగమదముతో నల్లగా మసివంటి పూతపూసి, చమరీ మృగవాలమును ధమ్మిల్లిముగా నొనరించి, ఏనుగు కుంభంబులలో నేరిన ముత్యములతో కన్నుగ్రుడ్లును నిర్మించినట్లు తెలియుచున్నది.



(1194 పేజీ తరువాయి)

నప్పటికీ రాతలో లేనివాటికోసం ఆశించి ప్రయత్నిస్తే ఏమికీడు సంభవిస్తుందో అని నా భయం - ఆడపిల్ల రాజ్యాలేలుతూ సంపాదిస్తే తింటున్నాడు అంటే నాకు బాధలేదు, కాని ఆ "రాజ్యాలేలుతుంది" అన్నమాటచాలు, నీ జీవితాన్ని నాశనంచేయడానికి; నన్ను నలుగుర్లో తలెత్తుకోకుండా ... ... చెయ్య గలదు. పెళ్లిగావలసినదానవు - బంధువులు, ఆత్మీయులే ముందు ఏదో భూటకపు ప్రచారం సాగిస్తారు. వీటన్నిటితో ఆత్మశాంతి అంటూలేకుండా జీవితం చాలించాల్సి వస్తుందేమోనని నా బాధ, - అంతే. ఊఁ - లేమ్మా ! బంగారు తల్లివిగదూ !"

తండ్రి గొంతులోని గద్గదతను గమనించి కన్నెత్తి చూచింది. చెక్కిళ్ళమీదుగా జారుతున్న కన్నీళ్ళను చూచి తృళ్ళిపడ్డాది.

"లే నాన్నా ! స్నానంచేద్దువుగాని, భోంచేద్దాము" అని తండ్రిని లేవదీసింది.

స్నానం చేస్తూండగా "కష్టపడి, సుఖపడటంలో అవమానాలు, అహంకారాలు ఏమున్నయ్" అని ఎవరో తట్టినట్టయింది.

చిరునవ్వుతోవచ్చి విస్తరిముందు కూర్చున్నాడు. "అరశతాబ్దం క్రిందటి ఆచారాలను తనింకా అములులో పెట్టగలడా" అనుకుంటూ, అయితే "రాణీ! నువ్విప్పుడేమంటావు-ఉద్యోగం చేస్తానంటావుగదూ ! అది అట్టే మంచిపనిగాదమ్మా" అని కదిపేడు అసలు ఉద్దేశాన్ని వెల్లడిచేయకుండా.

రాణి ఏమీమాట్లాడకుండా, తలవంచుకొని భోజనంచేస్తుంది. - తండ్రి చెప్పినదంతా బాగానే వుందికాని ప్రత్యేకం ఆ రెండు విషయాలే అర్థం లేనివిగావున్నాయి. విధికి ఎదురీదడం అంటాడు. ఎదురీదడం ఏమున్నాది ! ఎంతమంది స్వయంకృషి వల్ల, స్వయందీక్షవల్ల జీవితాన్ని మధురమయంగా జేసుకోలేదు! ఎంతమంది తారాపథాల్లోకి జేరుకోలేదు. అసలు విధిలోనే అలా రాసివున్నాదని ఎందుకనుకోగూడదు - ప్రయత్నించే స్థిరపర్చుకోగూడదు! ఇక గౌరవం, మంచి, మర్యాదా, బంధువులూ బండరాళ్ళూ అంటారు. నిజానికి తనకి వున్నవాళ్ళు అరడజనుమంది మేనమామలు, చదువుకుని అన్ని విధాలా బాగా వున్నవాళ్లు, ఒక్కడైనా, ఒక్కనాడూవచ్చి తననిగాని, తన తండ్రినిగాని చూచినవాళ్లున్నారా! ... తననుకోగూడదుగాని, తనకంటే ఏఁవంత అందగత్తె అని, మెజిస్ట్రేటుగారి కూతుర్ని చేసుకున్నాడు ఆఖరి మాఁవయ్య - ప్రేమించేనన్నాడు - పెద్ద చదువు అన్నాడు. ఇంటరేగా! అదైనా ఫెయిలయింది. ఆవిణ్ణి ప్రేమించగలిగిన ఏపాటి మగాడైనా తనని ప్రేమించగలడు. ఎటొచ్చి ఆవిడ డబ్బున్న వాళ్ళమ్మాయి! తనో దరిద్రగొట్టు అని - అంతే - ఇక నలాంటపుడుకూడా నాన్నగారికెందుకో అంత భయం ... ...

"ఏమంటావమ్మా ! - మాట్లాడవేం" అన్నాడు తండ్రి మళ్ళీ.

"ఏమున్నాది నాన్నా ! - పరువూ మర్యాదా, స్నేహితులు, చుట్టాలు అంటావుగాని, మనం ఎలా బ్రతుకుతున్నామో, అసలు మనకీ లోకానికీ సంబంధం వుందంటావా - !" ఇంతసేపు ఆలోచించిన దాన్ని పైకి అనేసింది.

"అబ్బబ్బ వుండువి పుల్లపెట్టి కెలికినట్టుందమ్మా రాణీ - అందుకనే నావంటివాడిప్పటిరోజులకు పనికి రాడు. కాలం చాలించాలి అంటాను ... ఎంతసేపూ మీ దృష్టిలో గౌరవం అన్నా, మర్యాదా అన్నా వేషాలు వేసుకు తిరగడం, లేనిది వున్నట్టుగా నటించడం అనే అభిప్రాయంగాని, నీతికి, నిజాయితీకి, ఆత్మగౌరవానికి స్థానమేలేదు. ప్రస్తుతపు లోకమే అలా మారిపోయిందమ్మా, పేగులు మాడిపోతున్నట్టు ఆకలిదహిస్తున్నా, సుష్టుగా భోజనంచేసినవాడికి మల్లే తేనుస్తూ బయటికిరావటం, లోపల వర్టయినా లేకపోయినా పైన పన్నెండు గుండీలకోటు వేసుకోవటం ... చివరకి ఇవన్నీ ఆత్మవంచకాలని తెల్సినప్పుడు సిగ్గుపడతారు ... "

తండ్రి అంత కష్టపెట్టుకుంటాడనుకోలేదు రాణి.

"ఇక నువ్వువెళ్ళి నీకు నచ్చినట్టు ఏర్పాటు చేసుకో, నేనుకూడా లేననుకుని. వుండి ఏమినిర్వాకం చేశాను! గనుక, ఎలా అయితే అలాగే అవుతుంది."

తండ్రి అన్న మాటలకి మళ్ళా ఒక్కసారి, పాత కన్నీటిచారికలు ప్రవాహంతో నిండుకున్నాయి. చాలాసేపు ఆలోచించింది. ... ... తండ్రిచెప్పినట్టు స్త్రీకి భర్తచేతిలోనే సుఖపడే ఘడియలేమో! ... ఏమిటా సౌఖ్యం, అంతా అయింతరువాత అయినా అంత భర్త చేతిలో లాలనలు పొందేందుకు తనేమి ఇంజనీరుగారి భార్య అవుతుందా, కలెక్టరుగారి కోడలవుతుందా! చచ్చిచెడి ఓ వందరూపాయల గుమాస్తాగారిభార్యవుతుంది; ... తనని తనుకనే పిల్లల్ని పోషించేసరికే, "ఆ భార్యంటే" ఆ-భర్తగారికి అసహ్యం జనిస్తుందా, లేక గౌరవం కలిగేందుకేమైనా ఆస్కారంవున్నదా! ... అక్కడా ఈ జీవిత మాధుర్యాన్నే ఇంకో పాత్రనుండి చవిచూస్తుంది; దాంతోసరి - జీవితంలో మధుర ఘడియలకు నియమించబడ్డ కోలమ్స్ కాసిన్ని.

మధ్యాహ్నం లేచింతరువాత, ఓ పావుగంటసేపు అటకవాసాలు లెక్కపెట్టేప్పటికి, ఒక ఆలోచన హఠాత్తుగా నిర్ణయంఅయి కూర్చుంది. దాంతో రాణీకి ఎక్కడలేనిబలం, సంతోషం సమకూడేయి. తండ్రికి కాస్త టీ ఇచ్చి, తనూ పుచ్చుకుని స్నేహితురాలు ఎలీనా దగ్గరకి బయల్దేరింది.

వెళ్ళగానే స్నేహితురాలు రెండు చేతులా ఆహ్వానించి మర్యాదచేసింది.

ఇద్దరూ చాలా పాతవి, పాతవి, కొత్తవి, సరికొత్తవి మాట్లాడుకున్న తరువాత, టీ కలుపుతూ, "అసలు ఏదో క్రొత్తగావుందే, నువ్విలా రావడం" అన్నాది ఎలీనా.

"ఏం రాకూడదా, స్నేహితురాలువి కనుక వచ్చాను" - ఉపోద్ఘాతంగా అని నవ్వింది రాణి.

"అబ్బే! - నీలాటి బంగారుకోడిపెట్ట అణుకు మాని మా యింటికొచ్చిందంటే, ఏదో వున్నదన్న మాటే లక్ష్మీప్రసాదం ... మారేజ్ ఏమేనా ..."

"ఆఁ - అదొక్కటే దిగడిపోయింది - దానికేంగాని ఎలీనా, నాకూ టైపూ, షార్టుహాండు నేర్చుకొని, ఉద్యోగం చెయ్యాలనుంది ..."

"ఏమిటిరాణీ! నువ్వు ఉద్యోగంచేస్తావా" ఆశ్చర్యంగా.

"ఏం - ఎందుకంత ఆశ్చర్యం? నువ్విచ్చిన సలహాయేకదూ ఒకప్పుడు."

"అవుననుకోమి - ఫాదర్‌కి బొత్తిగా ఇష్టంలేదన్నావుకదూ!"

"ఫాదర్‌ని ఒప్పించేను - ఇక నువ్వు చేయవలసిన మహోపకారం ఒకటివుంది ..."

"ఏఁవిటది?"

"ఇపుడు ఇన్‌స్టిట్యూట్‌కి, అరవయ్యో, డెబ్బయ్యో కావాలిగదూ, అది నువ్వు సర్దితే" అన్నాది రాణి గుండెలమీదనుంచి ఎంతో బరువు దించుకున్నట్టు.

ఆ బరువంతా స్నేహితురాలి గుండెలమీద పడనే పడ్డాది చెక్కుచెదరకుండా.

"ప్రస్తుతం నాదగ్గర ఏమీలేదురాణీ ఏదో ఇంటి ఖర్చులకుమినహా."

"మరికనెందుకు నేనీ గాలిమేడలుకట్టడం - వున్న ఆయువుపట్టుకూడా రాలిపోయింది."

"ఏమీఅనుకోవు గదు రాణీ! నిజంగా చెపుతున్నాను, నెలాఖరుకుచేతిలో చిల్లికానీమిగలదు. అందరూ అనుకుంటారు మొగుడూ పెళ్ళాం సంపాదిస్తున్నారు, వెనకెయ్యక ఏంజేస్తారదంతా అని...."

రాణీ మౌనానికి ఎలీనా చాలా చింతపడ్డాది. నిజంగా రాణి తన మాటలు నమ్మకే అలా వూరుకున్నాదని. కాని, రాణీ తన కూలిపోయిన ఆశాసౌధాల్లో దేన్నో వెతుక్కుంటూవుంది.

కాలం శబ్దాన్ని ఆశ్రయించింది క్షణంసేపు.

"ఒకపనిచేద్దాంరాణీ!" అన్నాది ఎలీనా, గజబలంతో.

"ఏఁవిటది" రాణీ నీరసంగా అడిగింది.

" - నీకు అంతసొమ్ము ఒక్కసారే ఎందుకు. నెలనెలా ట్యూషన్ ఫీజు పదో, పన్నెండో ఇస్తుంటాను."

(సశేషము)

# మామయ్యా!

శ్రీ పణతుల రామచంద్రయ్య



మామయ్యా!

రాద్దామా, వద్దా అనే విషయమైనా ఆలోచించుకోక - కేవలం ఒక అసంకల్పిత ధోరణిలోనే నీకీ ఉత్తరం రాస్తున్నాను. దీనికి నువ్వు ఫ్రేముకట్టిస్తావో, ఉక్రోషంతో చించివేస్తావో! ఫ్రేము వేయించేటంత మృదుత్వం నీలో లేదని తెలుసు. అందుకే అభ్యర్థిస్తున్నాను - చించివేసేటట్లయితే కొనకంటా చదివి మరీ చించివెయ్యమని.

ఈ జాబులో నేను కవితాగానం చేస్తున్నానని మరేం భ్రమపడకు. నీలా నాకు కవిత్వం రా య ట ం రా దు. అయితే అత్తయ్యా వర్షించిన దివ్యప్రేమతో తడిసిన నా హృదయంనుంచి కొన్ని అశ్రుబిందువులను మాత్రం రాల్చగలుగుతున్నాను. నీ గృహచ్ఛిద్రాలలో జొరబడి నేను నీకు సలహాలివ్వటంలేదు. కాని అత్తయ్యా కష్టాలను చూచి సహించలేని నా హృదయవేదనను నీముందు పెడుతున్నాను.

డాక్టరీ చదవటానికి విశాఖపట్నం వచ్చేందుకు గూడూరుస్టేషనులో రైలెక్కేటప్పుడు ముందుగా నా స్మృతి పథంలో మెదిలింది అత్తయ్యే. కానీ అంత కుంకుమబొట్టు పెట్టుకుని, నిర్వేదంతో పల్చబడ్డ శరీరంతో, నిండుదనంలేని ఏదో బాధను వెనకేసుకున్న చిరునవ్వుతో ఒక్కక్షణం పాటు నా మనోఫలకంలో మెరిసి మాయమైంది అత్తయ్యా.

రెండేళ్లనాడు ఒక సారి నీయింటికి వచ్చాను - జ్ఞాపకముందా? అత్తయ్యా మా యింటికి వచ్చినప్పుడు, సెలవులకు ఇంటికివచ్చి ఊళ్లో వీధులన్నీ రోజూ సర్వే చేస్తున్ననన్ను "రావోయి అల్లుడా" అని చెవి మెలవేసి లాక్కువచ్చింది. అప్పుడు చూచాను నీయిల్లు. దేవసదనంగావుంది. నన్ను చూచి, నీవు అత్తయ్యాను "పట్టి కట్టి తెచ్చుకున్నావుటే అల్లుణ్ణి?" అని ఎగతాళి పట్టించడం, ఆరునెలల రాధాయిని నా ఒడిలో పెట్టి నాషర్టు తడిచేయించటం - చూస్తే నీ యిల్లు ఆనంద నిలయంగా వున్నదానాడు. ఇరవై రోజులున్నా నాకు ఇంటి ధ్యాసపట్టలేదు. అప్పటికింకా నీ చెల్లెలు విధవై నీపంచకు రాలేదు .....

నిజానికి - బంధుత్వ విషయంలో - అత్తయ్యా నీకన్నా నాకు రక్త బంధువు కాదు. నీపెళ్లికి ముందు నేనెవరో, అత్తయ్యా ఎవరో కాని, అత్తయ్యానన్ను రక్తస్పర్శవున్న కొడుకులా ఆదరించింది. ఈ ఉత్తరంవల్ల నీతో నాకు విరోధం

రావచ్చు; కాని అత్తయ్య మొహం చూసి- అందుకైనా నేను జంకడం లేదు.

అత్తయ్య రాకపూర్వం నీకేమున్నది? నిర్మొగమాటంగా అడిగేస్తున్నందుకు నీవు కంటగించుకుంటావని తెలుసు. యదార్థవాదిని కాబట్టే నేనసలు నలుగురిచేతా నాలుగు తింటూంటాను. అత్తయ్య యాభై వేల రూపాయల ఆస్తితో నీ గడప తొక్కింది. ఆతర్వాతనే నీకీ రెండు మేడలూ, సినిమా హాలూ ఏర్పడ్డాయి. కాని ఈనాడు లక్షరూపాయల సంపదకు యజమానురాలయినా అత్తయ్యకు నీయింట్లో ఆ స్థానం లేదు. ముసుగెట్టుకుని నీ పంచచేరినా నీ చెల్లెలు వెంకమ్మకు జబర్దస్తీ ఆవగింజంత తగ్గలేదు. కాంభోజ రాజు చరిత్ర పట్టుకుని ఆమె వీధి అరుగుమీద కాలక్షేపం చేస్తూంటే వంటింటి గోడల మధ్య అహర్నిశలూ తపసిస్తున్నది అత్తయ్య.

ఇంతా నిరుడు మీ వూరొచ్చినప్పుడు చూచాను లక్ష్మమ్మత్తయ్య స్థితి. ఆడబిడ్డ అధికారం. నువ్వు మునుపటిలా ప్రసన్నుడిగా లేవు. సినీమాహాలు గేటు వద్ద వుండే కిరస్తానీ ఆమెతో నీకులాసాలు జరిగి పోతున్నాయి. నీ ప్రవర్తనే మారి పోయింది. రెండు రోజులకొకసారైనా నీవు గడప త్రొక్కటంలేదు. అథవా వచ్చినా రుసరుసలాడి పోతున్నావు. ఇక రాధాయి సంగతి - ఏము[illegible]పేమైనా వెంకమ్మ కొడుక్కి సాగినతరువాతనే రాధాయికి!

మామయ్యా! మల్లెపందిరి క్రింద మంటల్ని ప్రోగుచేస్తున్న నీ మనస్సు నవవసంతమో స్మశానమో ఆలోచించుకో. అత్తయ్యను రాచిరంపాన పెడుతున్నావు. ఆ 'ఏసుదాసి'తో పాటు కులుకుతున్నావు. నువ్వు ఆఏసుదాసి సాంగత్యానికి పూర్తిగా స్వస్తి పలకనంతవరకూ నీసంసారపు ఎడారిలో గాలివానే తప్ప పూలవర్షం కురవబోదు.

ఆరోజు నేను సంచీపట్టుకుని ఇంట్లో అడుగు పెట్టగానే-అత్తయ్య ఎంత పొంగి పోయింది! మనిషి శుష్కించివున్నది. మొగం పాలిపోయింది ... ఎంతగా ఆదరించింది నన్ను! కన్నకొడుకు ఇంటికొచ్చినట్లే తాపత్రయపడింది. అయినా ఆ యింట్లో మునుపు నేను వచ్చినప్పుడు తొణికిసలాడుతుండిన ఆనందం ఆనాడు నాకు కనిపించలేదు.

ఇదంతా ఏమిటని అత్తయ్యనడిగాను. "ఏమీలే" దన్నది అత్తయ్య. "మామయ్య ఇంటికి రాడేం?" అని అడిగితే "పనుల్లో తీరిక చిక్కివుండదు" అంది. అబ్బ! ఎంత క్షమాగుణం అత్తయ్యది!

మర్నాడు పాలేరు రాముడు అంతా చెప్పాడు నాకు. అత్తయ్య అంతా దాచి

# పాముకాటుకు ప్రథమ చికిత్స

శ్రీ పి. ఎ. పెట్రిష్చెవా



విషసర్పం కరచినప్పుడు మొట్టమొదట, విషం, రక్త ప్రవాహంగుండా శరీరమంతా వ్యాపించకుండా జాగ్రత్త తీసుకోవాలి. ఒకవేళ దగ్గర ఎవరూ లేక పోతే సర్పదష్టుడే జాగ్రత్తపడాలి. కంగారుపడకుండా అతడు పాముకరచిన చేతికిగాని, కాలుకుగాని, పాముకుట్టిన చోటికి మీదగను గట్టిగా కట్టుకట్టాలి. తరువాత వెంటనే వైద్యసహాయం పొందాలి.

గట్టిగా కట్టిన కట్టును శరీరావయంమీద ఎక్కువ సేపు వుంచలేము. తాత్కాలికంగా దాన్ని తీసి వేయడంగాని, అరగంటలో దాన్ని వదులుచేయడంగాని చెయ్యాలి.

పాము కరచినచోట నెత్తురు కారుతూవుంటే, అందులోంచి విషం బయటికి వచ్చేస్తుంది కాబట్టి దానిని ఆపకూడదు సరిగదా, యింకా ఎక్కువగా నెత్తురు కారేటట్టు చెయ్యాలి. ఇందుకోసం అవయవాన్ని దిగువకు వ్రేలవేసివుంచాలి. గాయంనుండి నెత్తురు పిండాలి; యిది చేతులతో కాకుండా యితర సాధనాలతో చెయ్యాలి. గాయంనుండి నెత్తురు తీసివెయ్యడానికి గాయాన్ని వేడినీళ్ళతో కడగాలి; నీళ్లు కలిపినసారా (నూటికి 50 పాళ్లు ఆల్కహాల్) తో గాని, పొటాసియం పెర్మాంగనెట్ కలిపిన నీళ్లతో గాని (బాగా ఎర్రరంగు వచ్చేవరకు) కడగడం మంచిది. సోడాకలిపిన నీళ్ళుగాని (ఒక గ్లాసు నీళ్ళలో ఒక చెంచా సోడా) ద్రాక్ష సారాయిగాని గాయంమీద వెయ్యాలి. శరీరంనుండి విషాన్ని సాధ్యమయినంత త్వరగా తొలగించడానికి మంచి నీళ్ళు, టీ లేక కాఫీ తాగాలి. ఆస్పత్రిలో, ప్రాణి శరీరంనుండి తయారైన మందును 500-1000 ఘన సెంటీమీటర్లు, మలినరక్తనాళాల్లోకిగాని, కండరంలోకిగాని ఇంజెక్షన్ ద్వారా ఎక్కిస్తారు. డాక్టరు సలహామీద, గుండె, నాడీమండలంపని కుంటుపడకుండా మందులిస్తారు రోగికి. వానికి స్నానంచేయిస్తారు. చేతులమీద కాళ్లమీద వేడినీటి సంచులుంచుతారు; విశ్రాంతి తీసుకోమంటారు. నాగుపాముకరిస్తే కృత్రిమంగా శ్వాసకూడా కల్పిస్తారు. పాముకరిస్తే, విషానికి విరుగుడుగా సీరమ్స్ ఇంజెక్షన్ యిస్తారు. తేలు విషంకూడా కొంతవరకు పాము విషాన్ని పోలివుంటుంది. కాబట్టి తేలుకుట్టినప్పుడు కూడా పైన తెల్పిన ప్రథమ చికిత్సచేసి, తరువాత వెంటనే డాక్టరును పిలవాలి.

కారాకుట్ స్పయిడర్ అనే విషపురుగు కుట్టినప్పుడు పొటాసియం పెర్మాంగనెట్ కలిపిన నీళ్ళతోగాని (1 : 1000 నిష్పత్తిలో కలపాలి), కాల్సియం హైపోక్లోరైట్ కలిపిన నీళ్ళతోగాని (1 : 60 నిష్పత్తిలో) గాయాన్ని కడగాలి. పట్టీలు ప్రతి రెండు మూడు గంటలకూ మార్చాలి.

'టాస్'



తల్లి.—బెల్లం ఎక్కువగా తినకమ్మా! — కడుపులో పాములు పుడతవి.

కుమార్తె:—మంచిదేకదమ్మా! — కడుపులో పాములుంటే పాలు పుట్టలో పోయడానికి బదులు నా పొట్టలోనే పోయవచ్చు.




సీరియల్ కథ

# విజయలక్ష్మి

శ్రీ పిళ్ళా సుబ్బారావుశాస్త్రి

(గతసంచిక తరువాయి)

అసలీ బాణాలు విడుస్తున్నదెవరు? విజయవర్మ రక్తం కక్కుకుంటూ, అతి కష్టంమీద పిల్లనిచేరుకున్నాడు! నిజంగా ఆ అమ్మాయి అదృష్టవంతురాలు! రివ్వున వచ్చి అమ్మాయి పొట్టలో గ్రుచ్చుకోవల్సిన బాణం విజయవర్మ డొక్కలో గుండా దూసుకుపోయింది.

విజయవర్మ చాలా బాధపడుతూ బాణంవచ్చిన దిక్కుకేసి చూశాడు. వాళ్ళంతా కొండవాళ్లు. పాటలు పాడుకుంటూ తనవైపే రాశాగారు

కోయరాజువచ్చి విజయవర్మని లేవనెత్తి యిన్నిసీళ్లుపట్టేడు. కోయరాణి పిల్లని యెత్తుకు మూటలోని 'పుట్టతేనె' పట్టింది.

విజయవర్మ తన కథ నంతటినీ కోయరాజుకి చెప్పేడు. తర్వాత ''కోయరాజా! పిల్లని పెంచవలసిన బాధ్యత నీదే! ఆమెకన్ని విద్యలునేర్పి, ఒక రాజకుమారుడికిచ్చి వివాహంచెయ్యి! - ఇదో యీ రత్నాలహారం తీసుకో! దీనిమీద నా పేరు అదీ వున్నాయి. ఈమె రాజకుమార్తె అని నమ్మడానికి యిదే గుర్తు...!'' అంటూ విజయవర్మ కోయరాజుకి ఒక రత్నాలహారంయిచ్చి కళ్ళు మూశాడు...

కోయరాజుకి పిల్లలు లేకపోవడం మూలాన ఆ అమ్మాయిని కోయరాజ్యానికి తీసుకువెళ్లాడు.

అది మరొక కోయరాజ్యం. ఆ కోయరాజుకి ఈ రాజ్యాన్ని జయించాలని ఆశ గలిగింది. - వెంటనే సైన్యం సిద్ధంచేసుకొని యుద్ధం ప్రకటించాడు.

ఇది వినేసరికి ఈ కోయరాజుకి భయం వేసింది. అప్పునుమరి - ఉన్నపాటుగా యుద్ధమునకు రావాలంటే ఎవరికయినా భయమే! అయినా, ధైర్యంగా యుద్ధా

నికి బయలుదేరాడు.

రెండు కోయరాజ్యాలకు హోరాహోరీగా యుద్ధం జరిగింది. కోయరాణి విజయవర్మ కూతురిని ఎత్తుకొని యుద్ధం చేయసాగింది.

అవతల కోయసైన్యంలో ఒకడు విజయవర్మ కూతురి కంఠానికి గురిచూసి బాణంవదిలాడు.

అలా బాణం రావడం, చంటిపిల్ల గభాలున తల క్రిందకిచూస్తూ ఒంచేయడం, ఆ బాణం అమ్మాయిమీదుగాపోయి అవతల కోయరాజు గుండెల్లో గ్రుచ్చుకోవడం, యివ్వన్నీ క్షణంలో జరిగినవి!

ఇంకేముంది? అప్పటి ధర్మాల ప్రకారం ఆ కోయరాజు సైనికులు మన కోయరాజుకి లొంగిపోయారు!

గబగబా పరుగెత్తుకుంటూవచ్చి ఒక్కసారి పాపని దగ్గరికి లాగుకున్నాడు కోయరాజు. "నా తల్లి! నా తల్లివల్లనే నా ప్రాణంకూడా నిలిచింది ...! ఆ రాజు నా పైకి కత్తి విసరబోయాడు. కాని యింతలోనే వాణ్ణి నా పాప హాత మార్చింది" అన్నాడు కోయరాజు.

"పాప వస్తూనే విజయం సాధించింది! నా పాప పేరు 'విజయ'" అంది కోయరాణి.

"చా! బాగోదు ...! ... విజయలక్ష్మి అంటే బాపుంటుంది" అన్నాడు కోయరాజు.

దీనికంతా సమ్మతించారు. పాపపేరు విజయలక్ష్మి అయిపోయింది.

విజయలక్ష్మి పదేళ్లలో అన్నివిద్యల్లో ఆరితేరింది. గుర్రపుస్వారి, కత్తి ఈటె బరిసెలతో యుద్ధం అన్ని నేర్చుకుంది.

ఇక విజయవర్మ మంత్రి సంగతి చూద్దాం! – విజయవర్మ మంత్రి, సాగరసింహుడితో కేసరపురికి బయలుదేరాడు.

కేసరపురిరాజు కేసరవర్మ. కేసరవర్మ మహాకౄరుడు. న్యాయమేదో అన్యాయమేదో తెలీదు. రాజ్యమెలా పరిపాలించాలో తెలీదు. తానేవిధంగావుండాలో అంతకన్నా తెలీదు. రాజ్యంలో యిష్టం వచ్చినప్పుడు పన్నులు వసూలుచేస్తాడు. ఒకప్పుడు సంవత్సరానికి మూడునాలుగుసార్లు పన్నులు వసూలుచేస్తాడు. ఒకప్పుడు సంవత్సరంలో ఒక్కమారన్న పన్నులు వసూలు చేయించడు.

కేసరవర్మ, తండ్రిగారి దగ్గర విజయవర్మ మంత్రియొక్క తండ్రి మంత్రిగా పనిచేసేవాడు. కొన్ని కారణాలవల్ల అతని కొడుకు విజయవర్మ మంత్రి అయ్యాడు.

కేసరవర్మకి పిల్లలు లేకపోవడం మూలాన్న, సాగరసింహుణ్ణి పెంచు

కుందుకు యిష్టపడ్డాడు.

సాగరసింహుడు యిక్కడ పెద్దవాడవసాగాడు. కాని సాగరసింహుడికి మంచిగుణా లేవీ అబ్బలేదు! చిన్నప్పట్నుంచీ, పాములని చంపడం, పిట్టల్ని చంపడం, అమాయకులని హింసించడం, యివి దినదినానికి వృద్ధి అవసాగాయి.

విజయలక్ష్మి ఒక రోజు గుర్రంమీద షికారు బయలుదేరింది. అడవులంట ప్రయాణంచేసి అలసిపోయి, ఒక చెట్టు క్రింద విశ్రాంతి తీసుకుంటోంది.

ఇంతలోనే "ఝుయ్" మంటూ పెద్ద సుడిగాలిరావడం, గాలిలో విజయలక్ష్మి ఎగిరిపోయింది! విజయలక్ష్మి గట్టిగా కళ్లు మూసుకుంది.

తిరిగి విజయలక్ష్మి కళ్ళు తెరిచేసరికి, తానొక భవనంలోవుంది. ఆమె కాశ్చర్యం వేసింది. చుట్టూ కలియజూసింది. ఎవ్వరూ లేరు! నిర్మానుష్యంగావున్నా ఆ గది ఎంతో అలంకారంగావుంది. - ఆకలిగా వుండడంవల్ల అక్కడేవున్న పండ్లుతిని పాలు త్రాగింది.

"నేనిక్కడికెలావచ్చాను? ఎవరు తీసుకువచ్చారు" అంటూ ఆలోచించసాగింది. అలా ఆలోచిస్తున్న విజయలక్ష్మికి ఒక పెద్ద కాళీ విగ్రహం కనిపిం



రష్యాలో ఒక బాలోద్యానవనపు భోజనశాలలోని బాలబాలికలు.

చింది. 'ఏమిటా విగ్రహం' అనుకొంటూ దగ్గరకి వెళ్ళింది. "ఎబ్బే! మామూలు రాయే! - అరే ఏమిటలా బొడ్డుదగ్గర మెరుస్తోందీ?!" - విజయలక్ష్మి ఆ మెరుస్తున్న బొడ్డు దగ్గర వ్రేలుపెట్టి అదిమింది- విజయ త్రుళ్ళిపడింది, 'గుట్...'మన్న శబ్దంవిని.

"ఏమిటిదంతా మాయగావుందే...! ఇక్కడ నొక్కితే ఏమిటా శబ్దం" అంటూ శబ్దం వచ్చిన దిక్కువైపు చూసింది విజయ. అక్కడవున్న చిత్రపటం ప్రక్కకి వెళ్ళి రెండో గదిలోకి వెళ్ళేందుకు దారి యిచ్చింది. విజయలక్ష్మి గబగబా రెండో గదిలోకి వెళ్ళింది. రెండో గదిలో ఒక అమ్మాయి బోరగిలాపడుకోని వెక్కివెక్కి ఏడుస్తోంది.

విజయలక్ష్మి దగ్గరకి వెళ్ళింది. ప్రక్కనే కూర్చొని ఆ అమ్మాయిని తట్టింది.

"ఛీ..ఫో...!-నిన్ను చూస్తే భయం వేస్తోంది" అంటూ ఆ అమ్మాయి మరింత ఏడవసాగింది.

విజయలక్ష్మికేమీ అర్ధంగాలేదు.

"నన్ను చూస్తేనా, భయం" అని అడిగింది నెమ్మదిగా.

ఆ అమ్మాయి భయపడుతూలేచి విజయ వైపు తలెత్తి చూసింది.

"ఏం! అలా చూస్తున్నావ్? నేనేమయినా దెయ్యాననుకున్నావా" అంది విజయ.

"ఊఁ...! రాక్షసివనుకున్నాను...! - కాని మరెవరివి నువ్వు" అని అడిగింది ఆశ్చర్యంగా ఆ అమ్మాయి.

(సశేషము)

# బాలనాగమ్మకథ

(క్రీ. శ. 1340 ప్రాంతం)

శ్రీ చేకుమళ్ల కామేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

## అనుకరణం

ఈ కథలో ఇతర కథల అనుకరణం అక్కడక్కడ కనబడుతుంది. ఒక్కొక్కప్పుడు అవి అనుకరణాలు గాక జానపద కథల సంప్రదాయాలు కావచ్చు.

శ్రావణ మంగళవారపు పాటలో రాజు చెట్టెక్కి పండ్లుకోసుకొని క్రిందికి దిగి చూడగా, ఒక్క పండే మిగిలింది. అట్లే బాలనాగమ్మకథలో లక్ష్మీదేవి కూడ చెట్టెక్కి చాల పండ్లు కోసుకొని క్రిందికి దిగి చూడగా ఒడిలో ఏడు పండ్లు మాత్రమే మిగిలేయి.

మహాభారత కథలో పరీక్షిన్మహారాజు ఒంటిస్తంభం మేడలో ఉండి ప్రాణరక్షణకు ప్రయత్నించగా, లక్ష్మీదేవి ఉట్టికట్టుకొని కూర్చుని అదేవిధంగా ప్రయత్నించింది. కాని చివరకు ఆరాజువలెనే సర్పదష్టురాలయింది.

బాలనాగమ్మకథలోని మాయలఫకీరు పాత్రకు రావణుని పాత్రకు పోలికలేకపోలేదు. రావణుడు సీతనెత్తుకొనిపోయినట్లే, మాయలఫకీరు బాలనాగమ్మను ఎత్తుకుపోయేడు.

ఈ కథలో కాంభోజరాజుకథ అనుకరణ చాల ఉంది. కాంభోజరాజు పేరును అనుకరిస్తూంది నవభోజరాజు అను పేరు. కాంభోజరాజుకథలో నేత్రవాది పట్టణం వస్తే, బాలనాగమ్మకథలో నయనవాది పట్టణం వచ్చింది - నేత్రం, నయనం పర్యాయ పదాలు కదా! కాంభోజరాజుకథలో చెరబందిరాజు కార్యసాధనలో రాణులను వివాహమాడేడు. అట్లే బాలవద్దిరాజు కూడ వ్యవహరించేడు.

కాంభోజరాజుకథలో దైవమహిమ ఉంటే దీనిలో మాయలఫకీరు మంత్రమహిమ ఉంది.

శ్రీనాథుడు పల్నాటి వీరచరిత్రను క్రీ. శ. 1450 ప్రాంతంలో రచించేడు. దానిలో బాలనాగమ్మకథను అనుసరించిన ఘట్టాలు ఉన్నాయి. 1. బాలనాగమ్మకథలో బాలవద్దిరాజు అతని మిత్రులు ఆడినట్లే, బాలచంద్రుడు అతని మిత్రులు బొంగరాలు ఆడేరు. 2. బాలవద్దిరాజు నంబివారి నరసమ్మ తలమీది కుండనుచూసి బాణం విడవగా, ఆమె చేతికి తగిలింది. ఆమె బాలనాగమ్మను గురించి చెప్పింది. అట్లే పల్నాటి వీరచరిత్రలో బాలచంద్రుడి బొంగరం తగలగా అన్నమ్మ, అతన్ని తిడుతూ కొన్ని ముఖ్య విషయాలను చెప్పింది.

ఈ కథలో అనేక జంగంకథా సంప్రదాయాలు కనబడతాయి.

## అతిలోకాంశాలు

ఈ కథలో ఉండే అతిలోక (Supernatural) అంశాలను కొన్నిటిని వివరిస్తాను. పన్నెండు శిరస్సుల నాగేంద్రుడు లక్ష్మీదేవికి వరమిచ్చేడు. అట్టి నాగేంద్రుడే బాలవద్దిరాజుకు ఎదురై ఆశీర్వదించేడు. ఒక నాగేంద్రుణ్ణి బాలరాజు ఈ కథ ఉత్తర భాగంలో చంపేడు.

మునీంద్రులు మహాత్ముకలవారని మనంనమ్ముతాము. జడంగమహాముని వరంపొంది లక్ష్మీదేవి పాలమామిడి చెట్టెక్కి ఎన్నో పండ్లు కోసుకొని క్రిందికిదిగి చూసుకోగా ఏడుపండ్లు మాత్రమే మిగిలేయి. లక్ష్మీదేవి మరణించిన తర్వాత, ఆమె జీవాత్మ తన పిల్లలకోసం అనేక పండ్లచెట్లను పదార్థాలను సృష్టించింది. ఉంగరం మహిమవల్ల నెలల శిశువైన బాలనాగమ్మ మాట్లాడింది. ఇట్టి కల్పనే పింగళి సూరన్న కళాపూర్ణోదయ ప్రబంధంలో కల్పించేడు. మాయల

ఫకీరు బాలనాగమ్మను, తలారిరాముణ్ణి మాయం చేసేడు. బాలవర్ధిరాజు ఆమె కొడుకే అని బాలనాగమ్మకి దేవతలు చెప్పేరు. మాయలఫకీరు మంత్రదండం మనుష్యులను భస్మంచేసింది, ఇళ్లు వాకిళ్లు సృష్టించింది; అల్లే మనిషిని కుక్కలాగు మార్చింది. ఇట్టి అతిలోకాంశాలకు మూలకారణం భగవంతుని మహిమ, ఇంద్రజాలం. వీటినైన తగినచోట్ల వాడితేనే అందం. ఎక్కడపడితే అక్కడ తెచ్చిపెట్టడం అజ్ఞానం.

## అతిశయోక్తులు

మాయలఫకీరు ఒక్క పూట తినేతిండి ఎంతఉందో చూడండి —

రెండుపుట్లు రొట్టెలు తినినాడు
పందుంపెసరపప్పు తిన్నడేమి
ముత్తుంనూనె తాగె ఫకీరు
ఇరవై లోటాలకల్లు పట్టినాడు
నిప్పునపోసితే భగ్గనిమండే
ముప్పయి సీసాల సారాయి పట్టెను
మూడుపుట్లు గంజాయి నింపెను

(95.వ పుట)

గడ్డపారకాల్చి చెవిలో తిప్పితేకాని ఫకీరుకి మెలుకువరాదుట! ఫిరంగి దెబ్బలు తగలగా వాడు నల్లులు కుడుతున్నాయని అన్నాడు. ఇట్టి ఫకీరుని చంపిన బాలవర్ధిరాజు ఇంకా ఎంత అద్భుతమైన మనిషో చూడండి! అతను భూమిమీద పుట్టిన పన్నెండు ఘడియలకే అన్ని విద్యలను నేర్చేసేడుట! నిలువుటెత్తు బొంగరాలను ఆడేవాడుట!

పక్షులు తమ పిల్లలకి మేతకోసం ఏనుగుపిల్లను ముక్కున కరుచుకొని తెచ్చేయి. ఇట్టి కల్పన అరేబియా రాత్రుల కథలలోని సిందుబాద్ నావికుని కథలోఉంది. పక్షులు బాలవర్ధిరాజును మోసుకుపోయి ఏడు సముద్రాలను దాటించేయి. పులులు ఇత్యాది జంతువులు మనుష్య భాషలో మాట్లాడేయి. ఫకీరు ప్రాణం ఎక్కడో ఒక చిలుక శరీరంలోఉంది. ఇట్టి కల్పనలు ఇతర దేశాలలోని కథలలోకూడ ఉన్నాయి. *

సైన్యాన్ని గురించి చెప్పే సంఖ్యలలో మాత్రం అతిశయోక్తులు కనబడవు. ఆ నాటి యుద్ధాలు కవికి స్వయంగా తెలిసి ఉండడంచేత అట్లు జరిగి ఉండవచ్చు.

యుద్ధంలో చచ్చిపోయిన సైనికులందరు పన్నెండేళ్ల తర్వాత బతికేరుట! ఈ అతిశయోక్తికి మూలం రామాయణకథ. రామ రావణ యుద్ధంలో వానరులు చచ్చిపోయేరు. చిట్టచివర ఇంద్రుడువచ్చి రాముణ్ణి కలుసుకోగా, రాముడు యుద్ధంలో చచ్చిపోయినవారినందరిని బ్రతికించమని ఇంద్రుణ్ణి కోరేడు. అప్పుడు ఇంద్రుడు నేలమీదపడి ఉన్న వాళ్ళనందరిని బ్రతికించేడు, కాని కుంభకర్ణుడి కడుపులో జీర్ణమైపోయిన వానరులను మాత్రం బతికించలేకపోయేడుట ♦ వెర్రిలోను ఒక పద్ధతిఉంది!

ఇటువంటి అతిశయోక్తులకు మూడు కారణాలున్నాయి. ఒకటి, ఈశ్వర భక్తి శక్తులచేకలిగే అధిక్యతకు, వాస్తవిక జగత్తుకి భేదం కనిపెట్టలేకపోడం, ఒక ఈశ్వర భక్తుడికి కొన్ని అలౌకిక శక్తులున్నాయంటే - నిజానిజాలెట్లున్నా - దానికి ఒక బలమైన కారణం చూపిస్తున్నాము. కాని ఒక పక్షిపిల్ల ఏనుగును ఎత్తుకుపోయిందంటే దానికి నమ్మతగిన కారణమేది? పిడుగుకి బియ్యానికి ఒకటే మంత్రమయింది! రెండు, వెనుకటి గ్రంథాలయిన మహాభారత, రామాయణ కథలను అన్ని అంశాలలోను నమూనాలుగా ఏర్పరుచుకోడం, ఆ కథలలో రాక్షసులున్నారు కాబట్టి మనం రాసే కథలలోకూడ ఉండాలి అని నిర్ణయించుకోడం, మూడు, సామాన్య జనులకు యథార్థ విషయాల చిత్రణకంటె అతిశయోక్తులు ఆనందమిస్తాయి - దీనికి వారి విద్యావిహీనతే కారణం. అట్టి శ్రోతలను మెప్పించేటందుకు కవికూడ ఆ మార్గాన్ని తొక్కవలసివచ్చింది.

(సశేషము)

♦ భాస్కర రామాయణం, యుద్ధకాండం, పద్యాలు 2446-2458.

* ఇట్టి కల్పనలు ఇతర దేశకథలలోకూడ ఉన్నట్టు ఈ క్రింది పుస్తకములో ఉంది - Folk Tales of the Nations, Published by Thomas Nelson and Sons, London P. 195.




గర్భిణీ స్త్రీలకు కొన్ని సలహాలు: డాక్టరు జి. వెంకటస్వామి బి. ఏ. యం ఎస్. ప్రాప్తిస్థానము : పళనియప్ప బ్రదర్స్, చేపాక్, మద్రాసు 5. మూల్యము రు. 3-4-0

ఇది 1953 వైద్యగ్రంథాలలో ఉత్తమ గ్రంథంగా మద్రాసు ప్రభుత్వ బహుమతి బడసిన తమిళ గ్రంథమునకు ఆంధ్రానువాదము.

ఈ గ్రంథములోని వివరణ గర్భిణిస్త్రీలు ఎవరికివారు వైద్యముచేసికొనేందుకు కాక తగుజాగ్రత్తతో ఆరోగ్యమును కాపాడుకుంటూ చికిత్సను అవగతం చేసికోడానికని యుద్దేశించబడింది. ఇందలి సూచనలు, సలహాలు అమూల్యములైనవి. తమిళగ్రంథాన్ని తెలుగులో సయితం తీసికొనివచ్చి గ్రంథకర్త ప్రశంసనీయుడైనాడు.

రమారమి 33 శీర్షికలలో గర్భిణీ స్త్రీలకు సంబంధించిన అనేకవిషయాలను సూటిగా క్లుప్తంగా, సులభ గ్రాహ్యంగావివరించారు. ఇందలి చిత్రాలు యిందలి వస్తువుకు ప్రత్యేకతను కల్పించినవి. గర్భిణీస్త్రీల ఆయురారోగ్యాలనుద్దేశించి భార్య, భర్తలకు యిందులో అపారంగా విజ్ఞాన విశేషాలు వివరించబడినవి. పుస్తకం గెటప్, ముద్రణ చాలబాగున్నది. ప్రతియొక్క మహిళ చదువవలసిన గ్రంథము.

'తెలుగు విద్యార్థి' జన్మదిన సంచిక మా కార్యాలయమునకు చేరినది. సంపాదకుడు : శ్రీ కొల్లేరు కోటేశ్వరరావు. వెల 0-8-0.

ఈ సంచికను వెలువడజేయడములో పత్రికానిర్వాహకుల కృషి ప్రశంసనీయము. ఇందులో విద్యావిధానము, విద్యార్థులకు సంబంధించినవి-అమూల్యమైనవ్యాసాలు, కథానికలు, గేయాలు మొదలగు ప్రత్యేక ఆకర్షణలున్నవి.

తెలుగువిద్యార్థి లోకపు విద్యాపురోభివృద్ధులకు తోడునీడై ఆదర్శనీయమైన విద్యావిధానము రూపొందడానికి 'తెలుగు విద్యార్థి' కలకాలము వర్ధిల్లాలి!

ప్రాప్తి స్థానము : మేనేజర్, 'తెలుగు విద్యార్థి,' మచిలీపట్నం.

అక్షరసుందరి : శ్రీ యస్. ఆర్. యస్. అయాచిత్, ఆంధ్ర విశ్వకళాపరిషత్, పూర్ణానందపేట, విజయవాడ - 2 వెల 0-12-0.

ఇందులోని గీతాలు చక్కని భావసంపదతో పాఠకులలో వాస్తవికతను, చైతన్యాన్ని ప్రోత్సహిస్తున్నవి. చదువను చదువను ఆసక్తిని కలిగిస్తూ భవిష్యత్ వర్తమాన కాలములలోకి విచక్షణా జ్ఞానంతో చూడమని ప్రబోధిస్తున్నవా అనిపిస్తున్న యీ గీతాలు ప్రత్యేకతగా కనుపిస్తున్నవి. సరళమైన భాష, సులభ శైలి యీ పుస్తకాన్ని ప్రతివారికి అందుబాటులోనుండేటట్లు చేసినవి.

---

# సంపాదకీయములు

## లలితకళల పునరుద్ధరణ

జాతీయ వికాసానికి లలితకళల పునరుద్ధరణ అత్యావసరమనునది వాస్తవం. కాని యీనాడు కళలు ప్రజాసామాన్యానికి ఎంతమాత్రం అందుబాటులోనున్నవి ? అందుబాటులోకి రావడానికి ఏమిచేయాలి? అనే విషయాలు పరిశీలించవలసినవి.

జాతీయావసరములలో లలితకళలుకూడ ఒకటి. మానవుని బుద్ధి వికాసానికేమి, ఉత్సాహోత్తేజాలను కలిగించి జీవితరంగంలో ముందుకు నడుపడానికి ఆహార పానీయాలలాంటి దైనికావసరములతో సమానంగా లలితకళల ప్రభావం అత్యావసరము.

లలితకళలు పునరుద్ధరణ జరుగడానికి అవి వారివారి అభిరుచులనుబట్టి ప్రతివారికి అందుబాటులో నుండాలి. అందుకుగాను కళాకారుల పోషణప్రోత్సాహాలు, ప్రజలలో కళల సాధన, శిక్షణలు, సులభ సాధ్యములుకావాలి. లలితకళల అభ్యున్నతికి కేంద్రాలు బహుళవ్యాపకంకావాలి. కళాకేంద్రాలలో శిక్షణ సాధనలతోబాటు కళాప్రదర్శనలకు అవకాశముండాలి; కళారాధనకు, పిపాసకు కళాకేంద్రాలు బహుళోపయుక్తంకావాలి. ఇందుకుగాను ప్రభుత్వము, ప్రజలుకూడ ఆసక్తి చూపాలి!

## సహకార సంఘాల సమర్థనిర్వహణ

సహకార సంఘాల రిజిస్ట్రారు శ్రీ కే. సుబ్రహ్మణ్య నాయుడుగారు 'సహకార సంఘాల సమర్థ నిర్వహణకు సేవాపరాయణులు కావాలని' ప్రబోధించారు. దాంతోబాటు స్వార్థరహితులు, విద్యా, విజ్ఞానము కలవారు, బాధ్యతను గుర్తించి వ్యవహరించేవారు నిర్వాహకవర్గంగా ఏర్పడినప్పుడే సహకార సంఘాలు సమర్థంగా, ప్రజోపయుక్తంగా నుండగలవు. నిర్వాహక సభ్యులుగా ఎన్నుకోబడేముందు ఆస్తిపాస్తులను మాత్రం యోగ్యతలుగా పరిగణించకుండా నిస్వార్థం, నిజాయితి, విద్యావిజ్ఞానములు, సేవాతత్పరతలను గుర్తించాలి. ఆనాడు సహకార ఉద్యమం యొక్క ఆశయలక్ష్యాలు సిద్ధించగలవు.

## వ్యభిచార నిర్మూలన చట్టం అమలు

ఈ చట్టం అమలు సందర్భమున వివరాల సేకరణకు ఆంధ్రలో మిస్. కుప్పు నియమితులయ్యారు.

ఆమె యీచట్టం అమలుజరుగుటకు ముందు వ్యభిచారమనేది ఏ ఏ పద్ధతులలో, పరిస్థితులలో జరుగుతున్నది గుర్తించాలి.

వ్యభిచారము అనేక తీరులుగా సాగుతున్నది. విలాసభోగాల నుద్దేశించి కొంత, పొట్టాత్రానికి కొంత, నైతికస్థాయి దిగజారుడువలన కొంత జరుగుచున్నది.

ఇంకా స్త్రీ పురుషుల సమ్మతిలేనిదే జరిగేవివాహాలు, ఏకారణముచేతనైనా భార్య భర్తలకు మధ్యగల పరస్పర అయిష్టత, స్పర్థలుకూడ వ్యభిచారానికి దారి తీయుచున్నవి.

వ్యభిచారనిర్మూలన చట్టం అమలు సందర్భమున నైతిక స్థాయి పెరుగుదలను, ప్రజల ఆరోగ్య సౌభాగ్యముల నుద్దేశించి వ్యభిచారమునకు దారితీసే కారణాలను అరికట్టకలుగాలి. ఆనాడు యీ చట్టము సార్థక్యము నొందగలదు.

—o—

# శ్రీ మన్మథనామ సం॥ ర ఆశ్వయుజ – కార్తీకమాసములు

| | | | |
|---|---|---|---|
| 1955 సం॥ అక్టోబరు నెల | 16 | ఆ | శుక్లపా 47-8 చి 26-41 శరన్నవరాత్రారంభః కలశస్థాపనం |
| | 17 | సో | వి 49-53 స్వా 30.32 త్యా 4-19 |
| | 18 | మం | త 53.32 విశా 35-17 |
| | 19 | బు | చ 57-47 అనూ 40-43 త్యా 4-24 అమృతసిద్ధియోగః |
| | 20 | గు | పం 60-1 జ్యే 46-36 లలితావ్రతం |
| | 21 | శు | ష 2-29 మూ 52-37 సరస్వతీపూజా |
| | 22 | శ | ష 7-14 పూషా 58-38 |
| | 23 | ఆ | స 11-43 ఉషా 60-10 భానుసప్తమి దేవీత్రిరాత్రవ్రతం |
| | 24 | సో | అ 15-46 ఉషా 3-55 దుర్గాష్టమి |
| | 25 | మం | న 19-5 శ్ర 8-43 దశమితిధిః మహర్నవమి |
| | 26 | బు | ద 21-27 ధని 12-40 త్యా 4-12 శూన్యతిథిః విజయదశమి |
| | 27 | గు | ఏ 22-46 శత 15 33 అమృతయోగం |
| | 28 | శు | ద్వా 22-50 పూభా 17-17 ద్వాదశతిథిః |
| | 29 | శ | త్ర 21-39 ఉభా 17-47 శనిత్రయోదశి |
| | 30 | ఆ | చతు 19-14 రేవ 17-5 త్యాజ్యాభావః తిధిద్వయం |
| | 31 | సో | ○ పౌ 15.40 అశ్వ 15-15 |
| 1955 సం॥ నవంబరు నెల | 1 | మం | కృపా 11-6 భ 12-25 |
| | 2 | బు | వి 5-57 ఏష్యం 54-9 కృ 8-46 అమృతసిద్ధియోగం |
| | 3 | గు | చ 53.23 రో 4-32 |
| | 4 | శు | పం 46-55 మృ 0.2 ఆర్ద్రా 55-21 త్యా 3-41 |
| | 5 | శ | ష 40.40 పున 50-56 ప్రదోషాభావః |
| | 6 | ఆ | స 34 55 పుష్య 47-4 |
| | 7 | సో | అ 29 53 ఆశ్లే 43 56 త్యా 3-48 |
| | 8 | మం | న 25-46 మ 41-47 |
| | 9 | బు | ద 22-44 పూఫ 40-44 త్యా 4-1 |
| | 10 | గు | ఏ 20 54 ఉఫ 40-53 |
| | 11 | శు | ద్వా 20-18 హ 42-14 |
| | 12 | శ | త్ర 20-58 చి 44-47 |
| | 13 | ఆ | చతు 22-49 స్వాతి 48-26 |
| | 14 | సో | ● అమా 25-41 విశా 53-0 |
| | | | **కార్తీకమాసము** |
| | 15 | మం | శుక్లపా 29-26 అనూ 58-19 కార్తీకస్నాన ప్రారంభం |

Printed & Published by Dr. S. Seshagiri Rao, at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.



ఆగష్టు 15-వ తేదీన 300 మంది బీదలకు అన్నదానం చేసిన మహిళా సమాజం (బురుజుపేట - విశాఖపట్నం) సభ్యురాండ్రు, కార్యవర్గ సభ్యురాండ్రు తీయించుకొనిన ఛాయాచిత్రము.

---



మద్రాసు రాష్ట్రంలోని దిగువభవానీ ఆనకట్ట దృశ్యము

